# Publisher's Note.

పోషకమహాశయు లొసంగిన విరాళములు వందనపూర్వకముగా గ్రహింపబడినవి. వారివెనువెంట నితర ఆంధ్రమహాశయులును, భాషాభిమానులును, నాట్యకళాభిమానులును పోషకులగుదురని మాపూర్తినమ్మిక.

ఆంధ్రమహాశయు లీప్రథమపుష్పమునకొసంగు ప్రోత్సాహాదుల మూలమున నీవిధముగా, "సంఘసేవ"యే యితివృత్తముగ గ్రహింపబడి, మాయొద్ద తయారుగనున్న (1) నూకన్న, (2) అమరజ్యోతి (లేక, హరిజనోద్ధరణ) అనుసాంఘికనాటరాజముల నాంధ్రలోకమున కెఱుక చేయగలవారమని యిందుమూలమున విన్నవించుకొనుచున్నవారలము.

**The Indn. Art-Com. Home.**

# ఉపోద్ఘాతం.



శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతలో నుపదేశించిన "భూతదయ"ను పరమావధిగా గ్రహించి, సిరికి మూలాధారంబగు పల్లెటూరిజీవన మితివృత్తముగ గ్రహింపబడిన నా యీచిన్నిపొత్తమున స్వాభావికముగనుండుటకై కేవల వాడుకభాషనే వాడితిని. అందున నచటచట కొన్ని దేశీయంబులు ప్రయోగించితిని. ఆంధ్రసోదరు లీవిషయమును బాగుగ గుర్తించి నన్ను మన్నించుదురుగాక!

ఇందలి ప్రధానరసంబగు 'కరుణాహాస్యము'లకు అనుగుణ్యంబుగ నాచేకల్పింపబడిన పాత్రపోషించుటలో వ్యక్తిగతాభిప్రాయంబులు కించిత్తేనియు లేవనిగ్రహించి, ఇందలి బాగులనేగైకొని, ఓగులనోపికతో నేర్చి, ఆంధ్రపాఠకమహనీయులు దయతో, సందులకుందగుదిద్దుబాటుల నాకుపదేశింతురను నమ్మికతో నీనాటకము నాంధ్రమహాశయుల సమ్ముఖంబున బడవేయుచున్నాడను.

ఈపొత్తమును వ్రాయుటలో నాకనేకవిధంబుల సహాయమొనర్చిన శ్రీ విద్వాన్ తం॥ రామమూర్తిగారికి నాకృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నాడను.

ఈనాటకమునకు చెందిన ప్రదర్శనాదిసమస్తహక్కుల నాకొసంగిన ప్రకాశకులఋణమేరీతి దీర్పగలవాడనోగదా!

గ్రంథకర్త.

# పాత్రలు.

## I పురుషులు

1. రామబ్రహ్మం —మాల, విద్యావంతుడు.
2. దాసుపంతులు —గ్రామమునసబు.
3. బహద్దర్ —మేజస్ట్రేటు.
4. అవధాని —గ్రామస్థుడు.
5. సోమిగాడు —చాకలి } గ్రామ
6. కురవడు —మంగలి } నౌకర్లు
7. కర్రిశెట్టి —గ్రామంలో చిల్లరవర్తకుడు.
8. పురుగ్గాడు —గొల్ల- రామబ్రహ్మం రైతు.
9. —ఒక రైతు.
10. —ఒక పురవాసి.
11. ఊరుతలారి —(బారిక)
12. రామస్వామి —మేజస్ట్రేటుగారి బంట్రోతు.
13. బాలబైరాగి —
14. ,, —శిష్యులిరువురు.
15. పోష్టుజవాను, చాకలిపెద్ద, మరి యితరులు.

## II స్త్రీలు

1. కనకమ్మ —రామబ్రహ్మము చెల్లెలు, బాలవితంతువు, విద్యావతి.
1. సత్తి —సోమిగాని భార్య.

# విపరీతవ్యక్తి

## ప్రథమాంకము.

(ప్రథమరంగము.)

(ప్రదేశము— పల్లెటూరులో నొకపాక, అందొక ప్రక్క నొకపీటపై శ్రీసరస్వతీపట మమర్పబడి యుండును. క్రమక్రమముగ నొక్కొక్కరుగ యువకు లరుదెంచి, మౌనముద్రతో చేతులు జోడించి గ్రామస్థులుందురు. అందుచాకలి సామిగాడు, సంకులుగాడు, మంగలి కుంటివాడు, వగైరా లందరు నుందురు).

ప్రవేశము— కనకమ్మ.

క— (చేత పుష్పమాలను ధరించి, మందగమనముతో నరుదెంచి, యామాలతో శ్రీసరస్వతీదేవి నలంకరించి) జెయ్! శ్రీశారదాంబకు జెయ్!!

ఉ॥ జీవము లెన్నొకల్పనము జేసి చరాచరమిల్ల, వానికి
బ్భావలయంబులం దాదరిపోషణ యన్నది యొందుబెట్టి

యీజీవుల దానికై మిగులచిక్కుల బెట్టెను బ్రహ్మతో మ
మున్ గావు మటంచు వేడె దోకకింటను జూడుము భార
తాంబరో!

జెయ్! శ్రీసరస్వతీదేవికి జెయ్!!

(సభ్యులందరు జయజయారావములు జేయుదురు, మెల్లగ నడచుచు కనకమ్మ నిష్క్రమించును.)

ప్రవేశము— రామబ్రహ్మము.

రామ— (దోసిలియొగ్గి, అందు విడిపుష్పముల గ్రహించి, యెరుగుదెంచి)—

గీ॥ జాతిమతాంకురముల నడంచి, శారదాంబ!
వ్యక్తిభేదముల్ గల్పించువారలకు సు
బుద్ధి చేకురజేయుచు, పోరులాపి
సమత నెలకొల్పు మమ్మరో! సానుభూతి.

జెయ్! భారతాంబకు జెయ్!! భారతీయులకు జెయ్!!!

(సభ్యులందరు జయజయారావములు జేయుదురు.)

రామ— (చిరునగవుతో) కూర్చుండి! మీమీతావులలో కూర్చుండి మీమీచదువుల జరుగనిండు.

(అందరు తలొక దిక్కున కేగి కూర్చుందురు.)

రామ— (నలుదిక్కుల పరికించుచును) ఓహో! అనధ్యాస్య వారా!

అన— (లేచుచు) అవునండి.

రామ— (నమస్కరించును) లేవనక్కరలేదు, మర్యాద లెందుకు, నే నష్టుడను కాను.

అవ— అబ్బే కాదు. మీరిట స్థాపించిన ఈ భారతీ పఠన మందిరంలో, మీతో......

రామ— క్షమించండి. అదే నామతం కాదు. ఈ పఠన మందిరం మనగ్రామస్థు లందరూ నిలబెట్టినదే. ఎక్కువ తక్కువ తారతమ్యాలే లేవు ఇక్కడ

అవ— అవును. గాని, కొన్ని సందేహాలు......

రామ— ఓ! ఎవరెవరికి యేమేమి సందేహాలున్నా అడగవచ్చును. కావాల్సిని సావకాశంగా అడగండి.

అవ— ఇదిగో! ప్రశ్న వేసి మరీ కూర్చుంటాను. లేకుంటే, ఎవ రేమనుకుంటారో తెలిసి కూడా, కాదా? వినండి. 'అందరూ ఒకటే' అంటున్నారే,—మేం మీలోగాని, మీరు మాలోగాని కలిసిపోవాలని మీయభిప్రాయమా? (కూర్చుండును)

రామ— (ముందున కొంగు వంచి) మీరు వేసిన ప్రశ్న చాలా దివ్యమైంది. అందరూ వినండి. ఆ 'కలిసిపోవడం వేనా' అనే మాటలో ఒకరింట్లో నొకరు సహపంక్తిభోజనం చేసుకోవచ్చునా, అని వీరి అభిప్రాయం అయివుండొచ్చును. అట్లు చేయుటవల్లనే, 'సమత' అని నేను చాటదలచుకోలేదు.

సోషి— సరైతే, బావ్! ఎవరో బాపనయ్యోరు మీకులం వోరింట్లో భోంచేసేరంట!

రామ— ఉండొచ్చును. తనకిట్టి వ్యత్యాసబుద్ధి లేదని రుజువు చేయటంకోసంచో, లేక మరెందుకో, అట్లు చేసివుండొచ్చును. కాని ముఖ్యంవేవిటో తెలుసా? సోంవులూ! ఏ జాతివానికైనా సరే, ఏదోరూపంగా సహాయం చెయ్యాలి, ప్రతీ మానవుడూన్ను. ఒకరి కష్టాల్లో ఒకరు తోడ్పడాలి! గొప్పఉద్యోగికీ, మంచి ధనవంతుడికీ, మర్యాదచేయడం కాదు, హీనదశలో ఉన్నవానికి సహాయపడ్డంవే మనవిధి.

అవ— (లేచి, నిలుచుండి) అయితే, మేం మిమ్మల్ని ముట్టుకోవాలి అని మీరు చెప్పరు! (కూర్చుండును.)

ప్రవేశము— ఊరుబారికి

ఊ. బా— సామే, దండాలు! (సభ నలుదిక్కులు పరికించుచుండును.)

రామ— (ఊరుబారికని జూపుచు) అయ్యో! ఈబారికివాడే ఉన్నాడు. వాని కూతురు ఇక్కడికి పదణాలు ఖర్చులో ఉందని తెలుసునుగదా!

అవ— ఆ! (తలనూపును.)

ఊ. బారి— ఇదేంది? (నిర్ఘాంతపోయి, జూచుచుండును.)

రామ— అర్జంటుగా రావల్సింది, అని వీనికి జాబు వచ్చిం దనుకోండి. ఆసంగతి మీకూ తెలిసి ఉంటూంది. అప్పుడు, "వీనికీ నాకూ భేదం లేదు" అనుకొని, మీరు వీనిని కౌగలించుకొన్నంతమాత్రాన వీని కేం లాభం? అదా మీరు చేయవల్సిన సహాయం? ఆలో చించండి!

ఊ. బారి— ఆ! ఆ! (చటాలున చేతిలోని దుత్తను విడిచి) బాబో! అలాంటి కాగితా వేదేనా వొచ్చిందేటుంటో, కొంపతీసి!

చా. సోమి— అది కాదోస్స! మాటవొరసకి సెప్పేరు, ఉపమానంగా!

బారికి— ఆనాగా! సరి! నా కెందు కీగోడనంతాను (దుత్తను గ్రహించును) అసలు, నాఁవని నానిడిసి! ఉ; ఈమూల నా కూకున్నాను! రా, బేగి, మునసబయ్య నిల్చొన్న పాట్న నిన్ను పిల్చుకొరమ్మన్నాడు.

చా. సోమి— అన్నా, చచ్చిందిరా గొత్రా! నేరకే మాట్లాడి నాను! సరె, ఒత్తుండావని సెప్పు. యెల్లు.

బారికి— ఏం, నాతోడ రా.

సోమి— అన్నా, వొత్తానని సెప్పమంటే నీకాక్కాదూ!

బారికి— ఏవో. ఎంతకోపంతో టున్నాడో గ్రియించుకో! నా నెల్తున్నా, మల్లా పిలమనకుండా మాత్రం వొచ్చేయ్ (నిష్క్రమించును)

సోమి— ఇదో, నానా నీయెనకాల! (రామబ్రహ్మము నుద్దేశించి) బాబ్! కానీండి! ఈరోజు, పానకంలో పుల్లనా గొచ్చేను.

రామ— (ఆలోచించి) ఎందుకైనా మంచిది, నువ్వెళ్ళు, పోవుంబా!

సోమి— సిత్తం, గానీ చిన్న సందేగం?

రామ— ఓ! తీరికగా అన్నీ తీర్చుకుందువుగానిలే, వెళ్ళిరా; నామాట విను.

సోమి— ఎయ్యో! అదీ యీసందేయంలోనే తలలో దూరి పోవాల! నేకుంతే, యీమట్టిశితలలోంచి మాయంవవు తుంది.

రామ— సరే, అడుగు, అయితే.

సోమి— ఏం నేదు. సాయం చెయ్యాలంటు, మాలాంటి బీదోళ్ళ కేంసాద్దెవవుతుంది?

రామ—ఎవరికి ఏది వీలో ఆసహాయంవే చెయ్యాడం చూడా! ఒకదిక్కులేని పక్షికి హఠాత్తుంగా ఓజబ్బుచేస్తుం దనుకో! డబ్బున్నవాడు ధనసహాయం, నీలాంటివాడు, ఎక్కడికేనా వెళ్ళడవని, ఇలాంటి పని చేయడం— ఇదీ సహాయంచెయ్యడవంటేను. ఇదే కాదు. నీవే ఉన్నా వనుకో, ఎవరికో ఓ ఉత్తరం రాయవల్సివస్తే, నీవు చెప్పినంతా శ్రద్ధతో విని, రాతాకొత్తా తెల్సిన

వాళ్ళు, క్లుప్తంగా ఓవృత్తరం రాసిపెట్టడం, ఇదీ ఒక సహాయమే, చెప్పవల్సివస్తే ఓలతులున్నాయి, సహాయం చేసేమార్గాలు, తెలుసా?

సోమి— ఓ! బోకపడిందినండి, మానకగ్గా, ఇప్పి......

బాలకి— (తిరగ ప్రవేశించి). బాబూ! దండాలు. ఈళ్ళని పిల్చుకొనిరా, వేగిరం పిల్చుకొనిరా; అని అబుగత తగుల్తుండాడాయె! ఈళ్ళా కదిలి రారు! మద్దె నాను నలిగి నస్తుండాను, ఇటినండి, అబుగతగోరు సెప్పమని న్దేంటంటే– "అళ్ళిద్దర్నీ పంపిత్తారా, నేదా? ఇక ముందెప్పుడూ సేరదీయకుండుంతారా, నేదా?" ఒక్కటే జవాబు సెప్పమన్నారండి.

రామ .. (తెల్లబోయి) ఎవళ్ళిద్దర్నీ?

బాలకి—ఇదెంగబావ! చాకలి పోవుల్నీ, మంగలి కురవాణ్నీ; గార్తిమనకెక్కు గందా, అళ్ళనే.

రామ— నమ్మన్నానికీ, పొమ్మన్నానికీ నేనెవణ్ణి, నీ యిష్టం, పిల్చుకొనిపో.

కుర— (లేచి) ఓరి, నా కిక్కడుండానని సెప్పినావంటర్రి, అక్కడ?

బాలకి— వెదచి, వెదచి నువ్విక్కడుండావా నేదా అంటే, నాకేం సెసని, ఈల్లేసి సెప్పేసినాను.

కు— సరిపోయిందినే. మెళ్ళు. నాను నల్లగ జారిపోయి, సుట్టూ తిరిగొత్తానూ, ఈపాలి అనుగుతే నానగపడ్నే

సినిమా త్రిగం సెప్పా. మరిసిపోయావా యెన్క. (రామబ్రహ్మముతో) బాబూ! శెలవుపుచ్చుకుంతానండి!

(రామబ్రహ్మము ఆలోచించుచు తలమాత్రమూపును)

కుగ— అదో! వొత్తున్నట్లుంది. (ప్రక్కదారుగ వెడలి పోవును.)

సోమి— (లేచి, తొంగి జూచి) నానూ శెలవుపుచ్చుకోంటా సండి! సరు, శారికిమావా! అప్పుడే సెప్పనేకపోనావూ ఏంటో ఎగతాళి కనుకున్నాను. (అనుచు బిరబిర పోవుచుండును.)

ప్రవేశం- దాసుపంతులు.

దా— (చిరాకుతో ప్రవేశించి) ఏవిరా వెధవా! ఎక్కడికి పంపిస్తే అక్కడ పాతుకుపోవడమే. ఏరీ, ఆవెధవలు?

సోమి— సిత్తం. ఇక్కడున్నానండి.

దాసు— ఆ! తీరిక కలిగిందా? ఆరెండో వెధవ యేడీ?

సోమి— ఎవరు బాబూ! కుగవన్నేనా? ఆడిప్పుడే యెల్లి పోయినాడండి, ఏదో పనుందని సెప్పి.

దాసు— పోనీ, వాడికేనా బుద్ధివుంది, నీలా గాడిదకాకుండానూ. పనీలేదు, పాటూలేదు. ఏంచేస్తున్నా వింత సేపూ? నీకుగాను పడికబుర్లా? నిన్ను పిలవడానికి నేను గూడా రావాలా? అంగిలి తాగేవాడికి మీసా లొత్తేవా డొకడా? ఛీ! ఈపాడుపా కొకటి వచ్చింది నాకీకల్మిదికి.

సోమి— ఎంతమాట సెలవిచ్చేరూ? ఏటో. ఉబుసుపోకకి కూచుండానా? ఈడేంటో తమాసా సేసేడనుకొన్నాను గానీ, నేనుండేనా? ఒక్కగంటులో వొచ్చేయనా? దయ సేయండి, తమరికార్యం చిటికెలో నడిపించేస్తా.

దా— ఉ! (హుంకరించి) ఆలాగా, సరే. ఈమాటికిక్కడ కనబడు, చెప్తా. (రెండడుగులు ముందునకు వైచి పొగచుట్టను పంటికొన కొఱుకుచు, సంకులుగానిని జూచి) ఇదిగో! సంకులూ! నువ్వుకూడా చేరుకొన్నా యిక్కడ?

సంకు— (లేచి, మెల్లమెల్లగ నడుగులిడుచు) నేను గావ్! తమరిపాదాలు తోడు. ఇదిగో, ఇప్పుడే చేనుకాడ కెల్తా (అవధాన్లను జూపించి) అదో. అయ్యగారియ్యాలే సెబ్తుంటే ఇంటూ నిలబడ్డాను. సెలవుచ్చుకొంటానండి [నిష్క్రమించును.]

దాసు— ఆ! అవధాన్లూ! సరి, మాటల్లో చేరిపోయే నన్ను మాట.

అవ— [కూర్చుండియే] కొన్ని విషయాలు చర్చించవలసి వచ్చెను. [లేచుచు] ఇది మాటలమందిరం కాదు మీ రనుకొన్న పాడుపాకా కాదు! మా గ్రామంలోనొక్క పఠనమందిరం, విజ్ఞానమందిరం [ముందున నడుగులెంచి] చూడండి!

దాసు —[అడ్డువచ్చి, వానిచేరువ కేగుచు] అదుగో! శిస్తు వసూళ్ళకి ఏ ఏడాదికో, రెండేళ్ళకో వస్తూంటావు కాబట్టి చెబుతున్నానూ, ఈగ్రామం సంగతి గాని, ఈపాక సమాచారం గాని, నీకు తెలీదు.

అవ— కాని, పరమేశ్వరునికి మీరు బోధింపనున్న వ్యత్యాస దృష్టి లేదు. కాస్త నిదానించి, ఆ శ్రీదేవీపథం చూసేరంటే, మీ హృదయానికే బోధకలుగుతుంది; నేను విశేషించి చెప్పనక్కర్లేదు! రామబ్రహ్మం! నేనుపోయిరస్తున్నాను.

రా— పునర్దర్శనం?

అవ— దైవాధీనం. [పరమునకు నమస్కరించి నిష్క్రమించును. వానితోడ, మరి యిరువురు నట్లే చేసి నిష్క్రమింతురు.]

దాసు— ఆ! పాకం ముదిరింది. కానీ, నీపిలక ఉందిలే నాచేతిలో. [క్రోరచూపులతో, రామబ్రహ్మమున్న దిక్కునకు చూడ్కు నిగిడించి] రాంబ్రహ్మం! ఈ గ్రామనౌఖర్లని నీవు చెడుపుతున్నట్లు తెలుస్తోంది. జాగ్రత! రారా సోవిగా! పోదాం! [నిష్క్రమించును.]

[ఊరుబారికి, సోవిగాడు దాసు పంతులువెంట బోవుదురు.]

రామ— అయ్యా! [నిర్ఘాంతపోయి చూచుచు నిలుచుండును].

ప్రవేశము- పురుగ్గాడు.

పురు— [రామబ్రహ్మమును వీక్షించి] ఏంబావ్! అలా నిల్చుండిపోనారూ?

రామ [చటాలున దృక్కుల మరల్చి] ఏంలేదు; ఏం వొచ్చేవ్?

పురు— మరేం బావ్! చాలా పొద్దెక్కుతోంది గదా! సల్లంది మాటే మరిసిపోనా రన్న మాట!

రామ—సరి, పద, [మిగిలిన సభ్యుల నుద్దేశించి]మీరూ ...

సభ్యులు— మేం తవురి యెనకాలే వొత్తాం.

రామ— సరే, అయితే. [బీగముచెవి నౌకరానిని ఒకని కిచ్చుచు] నీవు -

నౌఖరు— అన్నీ తెల్చున్లెండి, తెవురు నడుస్తుండండి. అన్నీ సరుదుకొని మకీ వొత్తాను.

[రామబ్రహ్మం వగైరాలు నిష్క్రమింతురు.పురుగ్గాడు వెనుకకు తగ్గి, ఒకనితో నేదియో గుసగుసలాడుచు బోవును.]

నౌఖరు— [మందిరములోని పొత్తములను, పత్రికలనూ, ఒక పేటికలో భద్రపరచి, తాళమువైచి, శ్రీసరస్వతీ పఠమునకు తెరవైచి పోబోవుచు, ఆగి] నాకేంతొందర రా! కాస్త తాళ్ళేకే యెల్తాను, [తలగుడ్డను దిగువవైచి, పరుండును.]

[తెర]

—•—

# విపరీతవ్యక్తి.

## ప్రథమాంకము.

### ద్వితీయరంగము.

స్థలము— గ్రామోపాంతముననొక చావరాయి

(Where villagers generally assemble to chit-chat)

ప్రవేశము-[1] ఆచావరాతి ప్రక్క నమర్చబడియున్న చిల్లరదుకాణము దరిగూర్చుండి, కర్రిశెట్టి.

[2] దుకాణమున కెదురుగ గూర్చుండి,- పురుగ్గాడు—

పు— [చటాలున లేచి, యాదుకాణము ప్రక్క ప్రేలగట్ట బడియున్న త్రాటికొనను గలనిప్పు సహాయమున పొగ చుట్టను కాల్చుచు]- అయితే, చెట్టిగోరూ! ♦మగా, బిందించిందంటారూ?

క.శె.—నీకేం మతో తోందేంటి? మన♦గేమంమరిపండేదేంటి లెద్దూ.

పు— మరీ దాచు బుగతన్నాడుట గందా, కొద్దోగొప్పో, మగలో చినుకులడితే, బిందించి నట్టేన?

---

♦. మగా. బిందించిన్దంటారా?— మఘకార్తిలో వర్షారంభమైనట్లే నా? (Did it rain during 'Magha's.)-

♦. గేమం— గ్రామం.

క. శే.— ఎవురు సెప్పిందీ? అదుగో, అలాంటి పెబువులుండ మట్టే మనగతి [ఇ] లాగయింది,

పు— అన్నట్టు, తెలకపుగుతానుగందా. నీబాకీ ఇచ్చే త్తుండాడూ?

క. శే.— ఆడి ♦బొంద, అసలాడు తీసుకొనేదంతా నజరా నాలేగా; పద్దుంటేనా బాకీతేలేదీ?

పు— అవునుగంద; అడిగేదానికా యీాల్లేదాయె. [అనుచు చుట్ట నడ్డపాగ బెట్టుకొనుచు, నారిపోతున్న యగ్నిని యుబ్బడమూలమున ప్రజ్వరిల్లఁ జేయుచుండును]

[పరివేశం— తప్పెటవరసను బాడుచు, చాకలిసోమిగాడు.]

పాట.

సో—

"వలనాడు పెవనాదూ
డాకిష్టి వనివేడా
ఉకర్కూత్తుంబవ నందూ
ఉదబాగించగ నేదా?

[పల్లవి] జాలము ఏలనురా!
నీలామేగచ్ఛ్యావా?" [2]

[చాపతాతిని సమీాపించి, మైలబట్టలమూట నటదించి, బింకముతో]— చెట్టీ! ఈవడలన్నీ తినేత్తే, ఏంపదెం?

♦. బొంద= వట్టిదే (పొల్లుమాట)

క. శె.— ఆ! మెర్రిమొగం, చాకలిసచ్చినోడివి, నువ్వు తినేదేంటి?- అదుగో, ఆమాటకొత్తే సెప్పా, బాప నోళ్ళకే సెల్లింది.

పురు— తుర, హేయ్! చెట్టే, చెట్టి. పందెం వేత్తాడా? మరి నాను సూడన్న!

[చంకపొదితో, మంగలి కురవాన ప్రవేశం]

కు— [మెల్లగా]- ఈబాపనోళ్ళకి మరేంపనినేదు. 'పోలో' మని అందరూ ఒక్కనాడే సావాలా?-

[గొణుగుకొనుచు, తనదారిని తాను పోవుచుండును]

పో— [కురవాయనుగాంచి] ఆ! చవయూనికి కురవన్నగూడా వొత్తుండాడు. ఆ! అరేయ్! ఓరన్నా, కురవన్నా! పిలిసినా పలకవేందిరా?

కు— [వెనుదిరిగి]- ఓడూ!- నువ్వంటూ?- ఏం? [అక్కడనే నిలుచుండును.]

పో— ఓస్, ఏం♦గీర్వాణంరా. పెద్దమనిసిలా అక్కణ్ణుండే మాట్లాడుతుండావ్. ఇలా రా, రయ్యా.

కు— [సమీపించుచు]- నీకంటే నాలుగిళ్ళుండాయ్. కడుపులో సల్ల కదలకుండా మాన్నం పండించు కుంతుండావ్,- నీకేం బాబూ, మారాజువి, వొల్లక♦తందనాలు సేసుకుంతావ్.

(♦) గీర్వాణం— దర్జా. (♦) తందనాలు— ఖులాసాకాలక్షేపములు.

పు— ఓరయ్యా, నీకొచ్చిన తక్కువేంది?

కు— [ముందున కరుదెంచుచు] సెపుతే ఇంటావో నేదో, మావా! ఏంకష్టపడితే, ఏంనాబం? సూసావా? బాప నీదిలో పెతీ బుగతకీ యియ్యాళ డెక్కేశానా? సల్లంది, ఇంకా నేదంటే నమ్ము. అత్తలా, మునసబయ్యకి సంతకెల్లి చావాన్ను నిల్చున్న పాట్న తేవాలంట! ముండామొట్టి, మూసుదమ్మిడీలైనా ముట్టసెప్పడు. ఏఁవడిగేవ్, నాబతుకూ [అనుచు, దుకాణమును సమీపించి],- చెట్టిగోరూ! మాపిటికి సొళ్ళంపుకుం తానూ, దివేత్తోంది, కూంతపొగాకిత్తూ.[అని పొగాకు తీసుకొని, చుట్టచుట్టుకొనుచు, చాపతూతిని సమీపించి, వెనుకకుతగ్గి, ఏవగింపుతో చాకలి నుద్దేశించి] ఓన్, సోవిఁగా! నీవెంత యిత్తిరీ సాకలోడివైనా, నీకేంపోగాలంరా?

సో— ఓస్సే, ఏందిరా, ఏఁటిరా నీగాబాయింపు? ఆకోపవం తా నామీదనటారి; ఆళ్ళమీదేసూపరా?

కు— ఓన్, ఏంగెర్రియింపురా, ఏంగెర్రియింపురా. అటుసూడరా, పదిమందీ కూకుండే సోటంటారి, మైలగుడ్డ లెట్టేదీ!

క. శె.— ఎయ్యే, నేనేఁ సూడలేదోరి, నీకేఁసెడుకాలంరా? ఇంకా సూత్తావేం, తీసేయ్. మునసబయ్య సూత్తే పీకలు నులివేత్తాడు;- వొచ్చేవేళయింది కూడాను.

సో— ఒస్సి ఆచాడం, మీపాటిబుద్ధి నాకు నేకపోయిందే? ఏసంజాకోడుకూ, పెబులు కూకుండేసోట అంటుగుడ్డలెట్టింది? సూస్కోండి, కనకమ్మగోరి సీరలకు మించి, మరేం మూటలోఉన్నా, మూతి మీదుయ్యండి. తెల్చిందా. ఆ! (హుంకరించును].

క. శె.— ఆ, ఆ. మాలదానిగుడ్డలంట్రా, సంపేసేవ్!

కుర—అయితేనేం, పర్వానేదునే! మరోబుగతొత్తే సెప్పలేంగానీ, దాసుపంతులేవొత్తే,- కనకమ్మగోరిసీరెలుగాఉన్నాయ్, అందులో! మరేం బయములేదునే!

సో—ఆ! ఎంతసాకలోణ్ణయినా ఆమాత్తరం కిటుకాలోసించనా?

కుర—అయితే, తెలకడుగుతాను గందా! ఆళ్ళిద్దరికీ,- మరి గంతే,- *ఇవాగం జరిగేటంత- ఏంటీ, యీ- జరిగిందంట! ఎంత*సత్తెవో?

సో—పోరా, సత్తెకాలం మాటంతాత్! మొగాడేం 'పీ' ఆడదానిమీద కన్నెయ్యేడవేంటీ, ఆడూరుకొంతాడా, అందులోనూ, మనదాచుబుగత! ఏంపురుగ్గా! అలా సూత్తుండావ్?

పురు—ఎంతగొల్లోణ్ణయినా, ఆమాత్తరం తెల్చుకోగల్ను, సోవులుమావా! ఎక్కడైనా సెప్పగానీ,- మాకన

* ఇవాగం = వివాహము, (*) సత్తెవో= సత్యమో!

కమ్మ ఇసయంలోమాత్రరం, దాచుబుగత కాదు గందా, బొమ్మదేవుడొచ్చినా, నాబంలేదు- ఆ, మ రేంటీ?

సోమ—అదికాదూ, నానేది! మొగోడేగందా, యీ ఇస యంలో ముందుదారి తీసేదీ, అంతా!

కర—పోనీ, పురుగన్నా! అడి పట్లాడు కడతున్నాడంతావా నేదా?

సోవి—ఆ! నానూ, అదే అడగాలనుకుంతున్నా! మరీ!-

పురు—నిజవే! సోవ్రులుమావ సెప్పిన్ది కాదన్లేంగానీ, బాప నోడుగందా, ఆళ్ళని తాకుతాడా? అంతా.

సోవ్రు—ఈళ్ళంతాపైకి బటారం, లోపలలొటారం వొస్! ఇంకా ఇదినయం. పట్నాలంటసూత్తునుగదా, పచ్చి మాంవసవే తింటారోస్, బాపనోళ్ళు!

పురు—అదినిజంనే! నానిచ్చేవోణ్ణీ, కోడిగుడ్లు మన మునచ బయ్యాకి!

సో—అదెప్పుడాస్?

పురు—పోనగంద వవాస్యకికాక, ఆయెనక అరికి నాను పాలి కాపుగ ఉండేవోణ్ణే, అపుడు!

క. కె.—ఓరాస్! మీాపున్నవుటుంది, ఆబాబొచ్చే వేళ యింది, కట్టిపెట్టరాస్ కబుర్లు.

సో—కోవటిపిటికీ, కోడిని నటికీ [వరుసను బాడుచు, మూట నెత్తిని బెట్టుకొని పోబోవును].

[ప్రవేశం- దాసుపంతులు]

దా—[చరచర ప్రవేశించి]- ఏవిరా, సోవిగా! వెళ్ళిపోతున్నావ్, నేరాగానే!

సో—ఏం నేదు మారాజా!

దా—ఏం, ఎంచేతేంటి, శెట్టిని ఎగతాళి చేస్తున్నావ్? ఏఁవొచ్చిందేంటి, సంగతి!

సో—ఏంనేదు బాబూ! [అనుచు పోవుచుండును.]

దా—ఏవిరా, చెబ్తుంటే నీక్కాదూ, ఏవిటా నిర్లక్ష్యం? ఇదిగో! శెట్టీ. ఎవరిమీద, ఇంతసేపూ, ఏవిటి మాట్లాడుకున్నారూ?

క. శె.—[లేచి, నిలుచుండి, వణుకుగాత్రంతో] మీామీాదేం కాదుబాబూ! లోకంపోకడ. ఒట్టు, సచ్చినట్టు!

దా—ఏవిటా చావడం?

సో—[వెనుకకుమరలి, శెట్టితో చెప్పవద్దని సంజ్ఞ చేయుచు] బాబూ! మీాకెందుకా అనుమానం?

దా—వెధవా! ఏంమాట్లాడకున్నారా్రి అంటే, తిరిగీ నన్నే *దబాయిస్తున్నావా? ఏదో ఉంది రహస్యం? లేకుంటే, ఎందుకాదాపరికం! ఏంచెబ్తావా, లేదా? ఏంకురఁవా, నీవు!

కుర—నానిప్పుడే వచ్చేను మారాజా! నాకేంతెల్దు! [దాసుపంతులు పురుగ్గానివైపు ఓరగాఁ జూచును. పురుగ్గాడు పక్కకుముగం త్రిప్పుకొనును. దాసుపంతులు తలతటాయించి, సోములుగానిని వీక్షించును].

* ధబాయించు = ఎదిరిపల్కుట!

సో — బాబూ! మీొసీడసూసి మీారే బెదురుతున్నారుగాని,- 'తెల్లబియ్యాం, పాటిమానికా- అసలేం లేదండి. ఏం మాట్లాడుకున్నాంవో అచ్చరాలా గేపకవ్వుంటుందాండి. తంవు రిలా పెళ్లిత్తారని ఏంకలగన్నావా? ఏవో నచ్చు ఊసులాడుకున్నాం. ఓరిమీాదా యేం సెప్ప కోనేదూ [అనుచు మూటనోచోటనుంచి, ముందున కరుదెంచి] అందునోకి తంవురి చంగ తే తలపెట్టనేదూ!

దాసు — ఆ! ఆలాగా! సరి నీక్కళ్ళు నెత్తికెక్కాయిరో? కని పెత్తన్నానుగా నీ*వాళకవంతా. జాగర్త పడు! తెల్సిందా? [అనుచు, శెట్టికొట్టుమీాది పాగాకు కట్టనుగైకొని, చుట్టచుట్టుకొని, తలపంకించుచు, నా చుట్టను పంటికొనను కొఱుకుచు, ముందునకు సాగి పోవుచుండును].

(దాసుపంతులునకెదురుగ గ్రామాభిముఖముగ బాడుచు బాలబైరాగి శిష్యులతో ప్రవేశించును. వారలగాంచి, నిలుచుండి, దాసుపంతులు తనజేబునుండి అగ్గిబొద్దునుదీసి, వెలిగించి, చుట్టముట్టించి కాల్చుచుండును.........ఆపాటను కడమవారు వినుచు, వానిదాపున నిలుచుందురు. సోవిగాడు మాత్రము కడుచేరువకేగి, తన్మయుడై తలనూపుచుండును).

దా — (కొంతవడికి, వారలవీడి, నాలుగడుగులు ఆవలకుజని, అటనాగి, వెనుదిరిగి)-ఒరే! సోవిగా! (జబాబురానందున, చటాలున వెనుకకు రెండడుగులిడి, కోపముతో)

---

(*) వాళకము = వైఖరి. (2) నచ్చు ఊసులు = లక్షవిషయాలు లేక, అనేక సంగతులు.

ఒరే! వెధవా! సోవిగా! పిలుస్తేపలకక్కర్లేదూ?

సో—సిత్తంబాబూ! (వానికభిముఖముగ బోవుచు) పాట లోని యేదాంతం యింటూ పరాకుబడ్డానండి, చెమించండి!

దా—వెధవా! నాపనిముందా, పాటముందా?

సో—సిత్తం, ఆలాగేకానీండి!

బా. బై—(ఒక్కతూరి దా॥ పం॥ ప్రక్కకుచూడ్కినిగిడించి) కలికాలమహిమ! [తిరుగ బాడుచు, బోవుచుండును.]

దా—[అలుకతో] ఏయ్! [అద్భుతగులును]. [బాలబైరాగి చలింపక నిలుచుండును].

దా—[కోపముతో] ఒరే, బిచ్చగాడా! నాకుతెల్సునులే నీవేషాలు! ఓ, లక్షమందినిచూసేను నీలాంటివేష గాళ్ళని.

బా. బై—[చిరునగవుతో]-హరహర శంభో! [తిరుగ బాడుచు బోవుచుండును].

దా—[మహాకోపముతో]-ఆ! ఏమదీ! చెప్పేది చెవులకెక్క లేదూ? ఏవిటీవాలకం! టెక్! ఆగు! ఏంవనుకున్నావ్ నీమనసులోకీ! చూడూ, నామాటలేక్స్తే నీకు గ్రామంలో ఒక్కదమ్మిడీఅయినా దొరకదుసుమా! ఏం, ఆగు తావా, లేదా? [కురవనుద్దేశించి] ఒరే! కురవా! వాణ్ణిలా యీడ్చుకొనిరా!

కు—పోనీండిబావ్! బిచ్చగానితో మనకు పంతవెందుకూ?

సో—(ముందునకరుదెంచి) బాబూ, పంతులుగారూ! ఈ బైరాగి సూడదేవుడునాగున్నాడు. సెబూ! ఆరితో కయ్యవెందుకూ! నామాటినండి. ఏపుట్టలో యేపా వుందో?

దా——(చీదరింపుతో) ఛీ! వెధవా! నీనించే యీచికాకంతా వొచ్చింది. పో! వీడిపని పట్టిస్తా, చూడు! లే, అడ్డంలే! ఏంకురవా! అలాచూస్తూనిల్చున్నావేం? గెంటేయ్.

(బాలబైరాగి చలించక నిలుచుండును).

సో—(బాలబైరాగితో) సామీ, ఏదోత్రృణం గ్రెయించండి. (ఒక రాగిడబ్బును ఇచ్చుచు) ఎందుకుసెబ్తున్నానో ఇనండీ, గురుడా! యెనక్కిమరలండి!

బా. బై. శి.—(దానినిగ్రహించి) 'చదువుకొన్నవానికన్న చాకలిమేలు!' (వరుసనుబలికి, తిరుగపల్లవినిబాడును) (బాలబైరాగి వేరొకచరణమును బాడుచు ముందు నకుసాగును) (క్రమక్రమముగ వారుగ్రామాభిముఖ ముగ బోవుదురు).

దా—(నిర్ఘాంతపోయి)ఆ, ఆ! ఏవిరా, అది! సోవిగా! కానీ నీకు నేనన్నా, నామాటన్నా, నాపనన్నా అంతనిస్సా కారంగాఉందికదూ! చూడు, నిన్నేంచేస్తానో!

సో—నేనేంచేసేను బాబూ! దానం ఇత్తేతప్పా?

దా—వెధవా! మీరెలా ఉరెట్టుకొచస్తే నాకేంకావాలి. ముందు నామాటచెప్పు.

సో— ఏఇసయ్యం బాబూ!

దా— వెధవా! ఉతుక్కువేసి పది, పంద్రెండుదినాలయింది గదా, ఏవిరా నాబట్టలు?

సో— బాబూ, ఒకదానికొకటి లంకేడితే సెప్పలేన్గానీ, తేపు చుక్కవారానికి వారం! ఆలస్యంవేదీ బాబ్?

దా— ఓరి, దొంగముండాకొడకా! నేను లంకెపెడుతున్నానా? నీఅబద్ధంకూలా! ఒకటి, రెండురోజులటో, ఇటో,— పోనీ, తేపటికి వారంఅవుతుందనుకుందాం— సరిగ్గా పదిరోజులూ కావాలేం బట్టలియ్యడానికి! ఏం శెట్టీ! వింటున్నావా?

సో— ఎందుకు బాబ్! చెనక్కాయలకాలంగందా! ముందెప్పు డైనా-యీపాటైనా-ఆలస్యంచేసానా?

క. శె.— ఏదో పెబువులు సర్దుకోవాలి! సాకలిముండావోడు, ఆడికేం తెలుత్తాయి బాబూ, పద్దతులు.

దా— తెలీదూ! పోనీ, నువ్వేచూస్తూన్నావుగదా! నేనెంత శాంతంగామాట్లాడుతున్నానో? అది వీడుగ్రహించేడా, అంటా! (చాకలిని వీక్షించి) ఓరి, పింజారివెధవా! నాశాలంకండువాట్రా దొరికిందీ, నీకు తలకుచుట్ట డానికి! శెట్టీ! నేనిక ఊరుకొనేదిలేదు. ఈవెధవ, నాబట్టలన్నీ ఇలాగే తగలెడుతున్నాడు!

సో— బాబూ! చూసీ, సూడకుండా పెబువులలా—

దా—(అడ్డమువచ్చి) ఆ! మాలవెధవా! ఏవిటీపేర్లెట్టున్నావ్ (ముందునకరుగును).

కు—కొంచెం తాలండిబావ్! ఆడుసెప్పేదేంటో ఇని మరీ-

సో—తవురేవో పెద్దింటోరే! ఎనకమావేదో మాట్టాడు కున్నావని, ఓనేరంసూ పెట్టాలని తలుత్తే సెప్పనేంగానీ, నాను తలకుసుట్టుకున్నగుడ్డ, తవరిదో, రాంబ్రెమ్మం గోరిదో, సిత్తగించి మరీ మొఖాన్నుయ్యాండి!

(తలగుడ్డనుఁదీసి, దాసుపంతులుదరి బడవేయును).

(కురవడు దానినిదీసి పరీక్షించుచుండును).

దా—(నిదానించి) ఓయ్! శెట్టీ! కురవన్నా! చూస్తున్నారా వాడిపొగరు! మాలవాడిబట్ట నామీద కెంతవిస్నా టంగావిసిరేడో! ఈవెధవ నేంచేసినా పాపంఉందీ! పోనీ గదాని ఊరుకుంటుంటే, నామీదే తిరగబడు తున్నాడుగదా, మిమ్మల్నయితే అమాంతంగా మింగే స్తాడన్నమాట! (చాకలితో) వెధవా! మాలగుడ్డలతో మా ఇళ్ళకొచ్చి, మాబ్రాహ్మణ్యాం చెడగొాడు తున్నావా? (వానిని సమీపించును).

సో—తాలండిబావ్! మరి నాయిమాలగుడ్డలుగందా, నన్ను తాకకండి! (చేతులు ముందుకుజాచుచు, వెనుకకు తగ్గును).

దా—(కోపము నాపుకొనజాలక) వెధవా, నన్నాక్షేపిస్తావా?

నాఅంతరవెక్కడ నీఅంతరవెక్కడరా! (వానిపై కలియబడి, వానినికొట్టును).

పు—మరి నానిక్కడుండకూడదుబాబో (నిష్క్రమించును). (సోమిగాడు రోదనచేయును).

కు—(మధ్యకరుదెంచి, సోమిగానిని విడఁదీసి, వానిని నెట్టుకొని గ్రామాభిముఖముగ బోవుచు) తాళరా! అదుగదే నానోద్దనేది! ఆరుఅనడానికీ, మనం పడడానికీ తగవంట్రా! ఎంతరోసంరా! (సోమిగాడు యీాంగ్రబడును).

క. శె.—అదే! నానసేదీని (లేచినిలుచుండును).

సో—ఆ! నానుచేసిన నేరవేంటీ, అంతా! నన్ను కొడతాడా! వదులూ! ఆ! (రోదనచేయును). (కురవడు పట్టును వీడక వానిని నెట్టుకొని దీసుకొనిపోవును. దాసు పంతులు, రోషముతో, కండ్లుఉముతూ, తల పంకించుచు నిలుచుండును. శెట్టి చేతులునలుము కొనుచు, దిక్కులు పరికించుచుండును, బెంగను దెలుపు చూడ్కులతో.)

దా—[నిట్టూర్పువుచ్చి, పంచపుట్టము సవరించుకొనుచు] అమ్మవెధవా! ఎంతపనిచేసేవురా? ఇదిగో! శెట్టీ! చూసేవా? వీణ్ణీవూళ్లోంచి గెంటేయాలి! నువ్వీవిషయంలో నాకు సాయంచెయ్యాలి సుఁవా!

క. శె.—[వణకుచు] ఏంసెయ్యమంటారు, బావ్?

దా— నాకవసరమైనపుడు నువ్వు నాపక్షం సాక్ష్యంచెప్పాలి!

కి. శే.— బాబూ! తవఁకాయించుకోండి. ఆయెనక ఆడే మీాపాదాలు పట్టుకుంటాఁడు, తవరే ఆడికి ఇనావిస్తారు.

దా— పోదూ, ఈరాజీకబుర్లు కెక్కడికి! చూసేవా? ఈబట్ట లాచింపేసేఁ?- తప్పదు, నీవునాకు సాయపడాలి!

క. శే.— బాబూ! ఆడిమీాద తవరు కలియబడ్డప్పుడు దానం తటదే చినిగిపోయిందేఁవో, పాతపంచకదా!- కుచ్చెళ్ళు కాలుకిింద పడివుంటాయి!-

దా— ఇదే నీపిఱికితనం, ఉండడవేంటి? [గుడ్డచించి] వాడు దీన్ని చింపేసేడని నేనంటే, నీవు ఒప్పుకుంటాఁవా, లేదా?

క. శే. — తఁవరిమాట కద్దు సెప్పలేన్గానీ,-

దా— ఆ! ఏవిటీ, కానీ, గోనీన్ని,-

క. శే.— ఏంలేదు మారాజా! సాచ్చెవనీ! చట్టుబండలనీ, కోట్లంట తిరుగుతూంటే, నాబేరంపోదా? అందులోనూ శెనక్కాయలగిరాకీ రోజులుగంద! నాల్లుడబ్బు లిప్పుడు చేసుకోకపోతే, పిల్లాజెల్లా బతికేదెలా, మారాజా!

దా— ఆ! సరే, బోధపడింది. [పోబోవుచు] నేనిపుడు బ్రతి మాలడవెందుకూ, సమన్లొచ్చేక నువ్వే హాజరవు తావు. అప్పటికీ మొండికెత్తేవంటే ఎరస్టుచేసిమరీ

నిన్ను కోర్టువారు రక్షిస్తారని నీకుమాత్రం తెలీదు గనకనా?

క. శె.——సామీ! సమస్తేవో స్తే సచ్చినట్లాజరవుతాను. ఒచ్చేనా, నాను సూసిన్దంతా అచ్చరాలా సెప్తా తానుగానీ,-

దా——ఆ, ఆ! [వెనుకకు రెండడుగులిడి], నీరాకటిపుడు నాకు పూర్తిగా బోధపడింది, అవును! ఇదంతా మీరు కుమ్మక్కైన చేసిందే. లేకుంటే, మేం కలియబడ్డం చూసి, ఆగొల్లవెధవ, పురుగ్గాడు చల్లగా జారి పోతాడా? సరి! ఆరాంబ్రహ్మంగాడు చెప్పడం, మీరు చెయ్యడంనా? శెట్టీ! [పండ్లుకొరుకుచు], నన్ను జయించే రనుకుంటున్నావు కాబోలు! ముందుంది చూడు,- ముసుళ్ళపండుగ. ఈదాసుపంతులు పగ పాంపగసుమా, చూడూ! నల్లగుండెల్లో నిదరపోతా నని మాత్రంనమ్ము. [చటాలున నిష్క్రమించును]

క. శె.——[వణుకుచు, నిలుచుండి]- చచ్చేనారీ దేవుడా! అటు! సూస్తేనుయ్యి, ఇటుసూస్తేగొయ్యి. అయ్యోరుసెప్పి నట్టినడవా, మానేయడవా? [క్షణమాలోచించి], దాన్తల్లీసిగ్గోసిన బేరం, పోతేపోయింది, తప్పుసాచ్చెం సెప్పేదానికి ఒప్పుకుంతా. లేకుంటే, అకునూకుగా, సంపేయడూ. [అనుకొనుచు, దాసుపంతుల్ని చరచర వెంబడించుచు], బాబో! ఆగరిహాంవొద్దు. నామాటి నండి. దయసేయండి. [అనుచు నిష్క్రమించును]

[ఒక్కనిముషము పిదప]

దా.—[చరచర ప్రవేశించుచు] ఉ! నాతో నీ కేంపని. నీ ఇష్టం వొచ్చినట్లు చేద్దువుగానిలే. ఉన్నాడుగా, నీకుమద్దత్తు దారుడు, వాణ్ణి ఆశ్రయించు!

క. శే.—[చేతులు నలుపుకొనుచు, బిక్క మొగముతో]- బాబూ! అనుగ్రహించాల. తమరుచెప్పినట్లు నడుచు కుంటా.

దా.—[ఆగి], ఆ! అణిగిందా, పొగరు. అలాదార్లోకిరా. [చాపగాతిపై చతికిలబడి], ఇపుడుచెప్పు నేను రాక మునుపు మీ రేం మాట్లాడుకున్నారో?

క. శే.— చిత్తంబాబయ్యా! అబద్దం ఎందుకూ. ఒక్కవిష యం మాట్లాడుకున్నాం. [మెల్లగా] చాకలోడం టాడూ- కనకమ్మగోర్ని- సత్తెంబాబయ్యా- మరీ- అయితే- నానుమాత్త్రం నమ్మనేదు సువంశీ.- ఆ!- తవరేవో,-

దా.—సరే, ఆగు. మరిచెప్పక్కర్లేదు, సంగతిబోధపడింది. చూసావా, ఆవెధవ, సోవిగాడెంత కల్పనకర్తో! అది కనిపెట్టే; ఆవెధవ కలా తగల్చి చ్చేను.

క. శే.—తవరు బాగా కనిపెడ్తారండీ, ఇషయాలు.

దా.—మరేంటనుకున్నావ్! ఇంకా, చూడూ, [చటాలున లేచి], చూడూ, ఈసంగతులు నలుగురూ నడిచే చోట మాట్లాడుకోకూడదు. అయినా; ఆరాంబ్రహ్మం

గాఢం దన్నుండాలి వాడికి. ఉ! గా! మాఇంటికి నాతో!
వాళ్ళు పన్నెకుకేర్గిటో బాగా కనిపెట్టాలి. ఏం
లేవవేం?

క. శె.—[లేచి] చిత్తం తవరు నడుస్తుండండి. దుకాణం సర్దు
కొని నానూ వొస్తాను.

దా.—ఆలాగే, మెల్లిగా నడుస్తుంటాను, రా! దారిలోనే
నన్ను కలుసుకోవాలి సుమా!

క. శె.—చిత్తం, చిటికెలోన రానా?

[దాసుపంతులు మెల్లగ నడుచుచు బోవుచుండును].

క. శె.—[దుకాణమును సర్దుకొని, బడ్డీనెత్తిని బెట్టుకొని]-
ఏంపీకల్మీదికి తెస్తాడో? దేవుడా! ఈగండంగడిసి,
ఒడ్డునపడ్తే, యెంకట్రవణమూర్తికి యేడాదివారాలు
పావుతులం కర్పూరం యెలిగించుకుంటా.

[అనుచు నిష్క్రమించును,]



# విపరీతవ్యక్తి.

## ప్రథమాంకము.

### తృతీయరంగము.

అదేగ్రామమున- ఊరివెలుపలి స్థలము-ఒక సన్నని బాటవెంట దాసుపంతులు చరచరబోవుచుండును. వాని వెనువెంట సోమిగాడు బోవుచుండును.

దా___కానీ, నాకామాత్రం అధికారం ఉంది.

సో___సిత్తం, మరిగంతే,

దా___ఛీ! వెధవా! అదిసర్కారుపని, నాతాతగారి పనేం కాదు! శెలవుమాత్రిం దొరకదు.

సో___పెబూ! మాకట్టం కూంతైనా సూడొద్దా, పెబువులైనాక!

దా___అరె! పొమ్మంటే నీక్కాదూ! ఉ! సో!

సో___పోనీండి, బావ్! ఈపాలి, ఆడ్నిపంపరాదా?

దా___టట్! అది అర్జంటుటపాలు. పట్నం ఈరాత్రిలోగా చేరాలి! నువ్వేతీసుకొవెళ్ళాలి! మానేస్తేమానేయ్!

సో___ఓ! ఎందిబావ్! కట్టపవయుం కాప్పాడకనేకపుతే నానేం

సేసేది! అంతగావొచ్చేకా, ఆరికాడే మనవిసేసు కుంతా! ఆమెనకా, అమూరాజేకొట్టనీండి, సెప్పుతో!

దా—ఏవిరో, నోరు మాజోరుగా విసుర్తున్నావ్!

సో—బాబూ! నానా?-ఓరై నాఇంటే నమ్మితారూ!-

(ఇంతలో నెవరోవచ్చుచున్నటుల అలుకుడు!)

సో—(ఆదిక్కునకుఁజూచి, ఆగి), అఆ! ఇదా, చంగతి. మరిక్కడుండకూడదు (వెనుకకుబోవుచు) పురుగ్గాణ్ని పిలుత్తే బావుంటుందేవో, (ఆలోచించి, వడిగబోవుచు ఒకతుప్పదరికేగి, ప్రక్కకుమరలి; వెనుదిరిగి, చూసి) ఉ! ఇక్కడుంటా! [ఆమరుగున దాగుకొనును]-

[దాసుపంతులు వాడు మరలిబోవుటగాంచి, బాట కడ్డుగ, నానచ్చుచున్నవ్యక్తికి వెనుజూపి, ఎదటనున్న వృక్షమును పరీక్షించుచున్నటుల నిలుచుండును]-

[ప్రవేశము, చేతపనిముట్లతో కనకమ్మ!]

క—[వానినిగాంచి, తప్పుకొనుచు బోవుచుండును].

దా—[కనకమ్మకాలు తనకుతగిలినటుల నటించుచు, తానే మరి వారికడ్డు నిలుచున్నందులకు విచారించుచు] రామ, రామ! ఎంత అపరాధము! కనకం, కోప్పడకేం! తన్నడంకూడా ఓమాదిరి సరసఁవేలే!

క—జాతీ, నీతీలేనివాళ్ళకి ఏంచెప్పి ఏంలాభం! [పోవుచుండును].

దా—సంతోషం! అలుకకూడానా! కనకం చూడూ! ఇన్నాళ్ళకా, నీకరుణ! ఇంతకాలం నన్నిలామాయ చేయడంన్యాయవా? [పోయి, చేతియందలి కొడవలిని గ్రహించి, బ్రతిమాలుచుండును].

క—[తప్పించుకొని, ఆకొడవలిని విడిచివైచి] ఏవిటీవాలకం? [సరోషకంపములతో] ఏం? ఒంటరిగానుంటినని బలవంతం చేయాలనుకున్నావా? ఓరి, పాపీ!

దా—నీవు నన్నెలాసంబోధించినా నాకు సమాధానవే! నేను పాపినే, క్రూరుణ్నే, కఠినాత్ముణ్ణే! కాని, కార్యవాదిని. నీఅనుమతికై వేచియున్నవిధేయుణ్ని! లేకుంటే బలాత్కారవే చేయాలంటే, నావంటివానికింత కాలవా? పిచ్చి!

క—[వెనుదిరిగి] ఓరీ! తన్నుదాను పొగుడుకోడంకంటే, తన్నుకొ చావడంమేలు! నీవీజన్మంలో కాదుగదా, వేయిజన్మాలెత్తినా, మానంకోసం ప్రాణంధారపోసే హైందవస్త్రీలను బలాత్కరింపలేవు, సరిగదా, అలా తలపెట్టేదానికే నీకు హక్కులేదు! నడు! నలుగురిలోనూ నగుబాట్లుకాకమునుపే!

దా—ఓహొహో! ఊరుకుంటున్నకొద్దీ వ్యాపారం ముదురుతోంది! ఏంవా, ఏకవచనప్రయోగం?

క—పొరపాట! పోనీ, గ్రామాధికారివిగదాని, కాస్త మర్యాద ఉంచేను.

దా—ఆ! అలాగా? [హుంకరించును].

క—ఆ! నిశ్చయంగా! నీకింకా మర్యాద! ఉ! [కన్నెరముగ నగి], కాస్త తెలివి తెచ్చుకొని, బుద్ధిగా మెసలుకో!

దా—[ఓరిమితో] కనకం! నీమీది ప్రేమచేత నిన్ను మన్నిస్తున్నానూ,-

క—కాని, నేనుమాత్రం, ఆగుణం విడిచిన్దాకా నిన్ను మన్నింపలేనందుకు విచారిస్తున్నా!

దా—కనకం! ఇటువిను! ఒక్కమాట! నాకోరిక చెల్లిస్తావా, లేదా?

క—[ఒక్కతూరి వీక్షించి, సంజ్ఞకొలికి, బోవుచుండును].

దా—ఆ! అబ్బ! ఎంతపొగరు! నామహిమ నీకింకా తెలియలేదు కాబోలు! ఈదాసుపంతులు పేరుచెబితే పిట్టలు సహా నీళ్లు త్రాగడానికి భయపడ్తాయ్, తెలుసా? ఆగు!

క—(పెడమొగముతోడనే) అంతేకాదు, చాకలాడా, బట్టలుతకడకానికి, వర్తకుడా అరువివ్వడానికి, ఒకళ్ళేవిటి,- కడకు గ్రామస్థులు దాసుపంతులు బహద్దర్ వారిద్వారా సర్కారుపన్నులు కట్టడానికైనా భయపడ్తారు!

దా—ఇదుగో!నీతాహాతుకుమించి వదరుతున్నావ్,జాగ్రత్త! నీపైని ప్రేమచేత ఇంతవరకూ ఓపికపట్టేను, ఇక ఊరకుండేదిలేదు. ఇపుడు నిన్ను బలాత్కరిస్తే నీకెవరు దిక్కు? [చేరబోవును].

క—[కోపంతో] ఆగు! ఉ! [కోరగఁజూచును].

[చాటుననున్న చాకలిలేచి, బైటకురాబోయి, ఉపా రుగ నుండును. దాసుపంతులు చటాలున నిలుచుండును].

క—[ఉన్నటులుండి, కంగారుతో] ఆ! ఆ! ఆగాగు! హత్య, వద్దు! పోనీ బ్రాహ్మడు!

[దాసుపంతులు, తప్పుకొని, నలుదిక్కులు భీతితో పరికించుచుండును].

క—[చటాలున మరలిబోవుచు] ఇంతలోఉంది, తప్పు తలపెట్టేవాళ్ళస్థితి! (శీఘ్రముగ అదృశ్యమగును).

చాటున డాగియున్న చాకలి, కడుపు చెక్కలగునటుల నగుచు ఊరిలోని కేగును.-

దా—[నిట్టూర్పుపుచ్చి] అరరే! చేచిక్కినదానిని నిష్కా రణం వదులుకున్నాను! ఛీ!

గీ॥ చంటిబిడ్డలనూరింప చక్కెరిచ్చి
కొదువనిముసములకు లాగుకొనినపగిది
కాంతలభియించురీతి నీచెంతకనిపి,
వేరుఁజేసితే దైవమ!............(ఆగి),
వెగడునై జారవిడచితి జగడమాడి! అన్నా! (చేతి లోని కొడవలినిగాంచి) మోసంజరిగిందే! దీన్నివిడిచి పోయింది, దొంగ! ఏలాగ? విషయాలువిషమిస్తు న్నట్లుంది! [ఆపెపోయినదారిని బోవుచుండును].

క్రిశెట్టి—[వెనుకప్రక్క నుండి, వడివడిగ ప్రవేశించి], పంతులుగారూ, పంతులుగారూ!

దా—[వెనుదిరిగి], ఎవరువారు?

క. శె.—నేనుబాబూ ఎవరినేంటి, యెంటలెరుముతున్నారూ?

దా—[కంగారుతో] ఆ నీవా? సరె చూసావా, ఎంతచిత్రం జరిగిందో?.

క. శె.—అంతా చిత్రంగానే ఉందిబాబూ,

దా—ఇది పరిహాసాలకి సమయంకాదు. చూడూ, యీ కొడవలి ఎవరిదో?

క. శె.—[పరికించుచు] కనకమ్మగారిదై వుండాలి.

దా—రామబ్రహ్మంగారిదై ఉండొచ్చునంటావా?

క. శె.—ఆ, మరేంబావ్, ఆరిదే. పోనపోలి పిల్లిసంతలో, యీ యిరిడిపిడే ఏయించానన్నాను, వురుగ్గాడు; ఇది మీకెలా గొచ్చింది?

దా—అదుగో! అక్కడేవ్రుంది, చితివంతాను, చూడూ, ఆగున్న మామిడికింద నేను గుంటకలగరాకు ఏరుతూంటే, ఏవరోవచ్చి, దీన్ని నాదగ్గరపడేసిపోయేరు!

క. శె.—ఆడదా, మొగాడా?

దా—నేనొకటిమాట్లాడుతూంటే, నీవొకటి మాట్లాడ్తావేం శెట్టీ! నీకేవైనాబుద్ధిఉందీ?-

క. శె.—చెమించాల. దూరాన్నుంచి సూత్తే చీరలాకనపడ్డట్టయింది ఆయెల్లున్నాళ్ళు కట్టుకున్నది! అంచ్చేతేలా

పెళ్ళించే! తప్పే, లెంపలేసుకుంటూ, చెమించండి!
(అట్లు చేయును).

దా—ఉండు, అసలుకథవిను, ఇదంతా చూస్తే, ఆరామబ్రహ్మ వేదోకుట్ర పన్నేటట్లుంది. అది గ్రహించి, ఎవరలా చేసేరో కనుక్కున్దావని నేను వెంటతరుముతూంటే,

క. శె.—చరి! నేనోచ్చేను, తెల్సింది. ఇపుడేంచేత్తారూ, మరి!

దా—ఇంకేంవుందీ, కుట్రకు కుట్రే ప్రతిక్రియ. నువ్వేం చేస్తావంటే;

క. శె.—చరి! మద్దెన్నేనా?

దా—ఇదిగో! (ఎర్రిగ జూచును).

క. శె.—ఆ, ఆ! చెమించండి, కానీండి! తవ్వరేదిసెప్తే, అది సేత్తాను. ఇవరంగా మాత్తరం సెప్పండి!

దా—ఏవీలేదూ, దీన్ని మాత్తరం తీసుకో వెళ్ళి పురుగ్గానికి ఇచ్చేసిరా!

క. శె.—ఎవరిచ్చేరంటే?

దా—కనకమ్మిచ్చిన్దని చెప్పు. లేకుంటే వాళ్ళపొలంలో దొరికిన్దను. ఆమాత్రిం బొంకడం తెలీదా?

క. శె.—మెల్లిమెల్లిగా ఈతలలో దూర్చుకుంతాను! (బోవుచుండును).

దా—(ఒక్కనిట్టూర్పువుచ్చి) అమ్మయ్యో! ఈబెంగతీరింది! ఇదుగో! శెట్టీ! అదిచ్చేసి, వేగిరంరా! అదుగో! మా పెద్దమడిదగ్గరుంటాను, నీకోసం!-

క. శే.—ఓ! చిత్తం!– (నిష్క్రమించును).

(దాసుపంతులు మెల్లమెల్లగ నడుగులు వేయుచు రెండవ ప్రక్కకు బోవుచుండును – ఆలోచించుచు).

(ప్రవేశం, కోర్టుబంట్రోతు–రామస్వామి).

రా—ఏమండో! మునసబుగారూ, దండాలు, ఎంత నెలికేనండి తపురికోసం!

దా—(వెనుకకు మరలి) ఎవరదీ? ఓ! నీవా. రామస్వామీ, రా! ఏంవి శేషం?

రా—(ఉత్తరమునిచ్చుచు) మీాకు తెలీదా?

దా—(అందుకొని, విప్పుచు) సరి! సరి! ప్రభువువారు కేంపు వేంచేస్తున్నారన్నమాట! ఇపుడే అర్జంటు టపాల్ పంపాలనుకుంటూన్నా, మీలే, ఆ! ఎపుడు?–

రామ—చిత్తం!

దా—(విప్పి, చదివి) సరే! కుటుంబసమేతంబ,

రా—లేదు సామీా!

దా—వంటమనిషిని వెంటబెట్టుకొని,

రా—అదీలేదు బాబూ! ఈఅయ్యోరిది, అంతచిత్రివండీ.

దా—ఆ, ఆ. అదేనేనూ అడగాలనుకుంటున్నా. చెప్పు. కొత్తపంతులవారుకదూ, అన్నట్టుగ!

రా—ఏంవుందిబావ్! సైూదాకుతగ్గయేసంనేదూ, యెవ్వా రాల్లా నానుస్తాడు.

దా—ఏమైనా కకర్కా_ర్తి,-

రా—అబ్బో! పెద్దపులి! అసలు మమ్మల్ని ఇనావులే దండు కోనీడు!

దా—అలాఅయితే కర్కోటకుడన్నమాట!

రా—అలాఅనలేవండో! పెతీపార్టీ సెప్పేమాట ఇంటాడు ఇవరంగా! నాయంకని పెట్టాడుగానీ రాజీలెక్కవ.

దా—ఉండుండు, ఎవరోవస్తున్నట్లుంది. (తొంగిచూచి) మా గ్రామం చిల్లరవర్తకుడులే! అయినా, తక్కిన విష యాలు తీరికగామాట్లాడుకుందాం!

క.శె—(త్వరగబ్రివేశించి) బాబూ. నేనెళ్ళేకా [రామ స్వామినిచూసి, ఆగిపోవును].

దా—నీసొదంతా తర్వాత వెడలగ్రక్కుదువుగానిలే! ముం దిటు చూడు! మేస్త్రీటుగారు మనగ్రామం కేంపు వేంచేస్తున్నారు! ఈబంట్రోతుకు...ఉ!- నీవెందుకూ మాఇంట్లోనే!

క.శె.—ఎంతమాట! ఆబాబున్నన్నాళ్ళూ, గంజో కడుగో బంట్రోతుగారూ, మాఇంటికాడ కేరండి!-

దా—సరే! ఎవరైతేనేం, మర్యాదగా జరిగిపోతేచాలు! మరైతే, ముందు మీఇంటికి తీస్కొనివెళ్ళి, చల్ది

అయినతర్వాత వీధిబడిసావిట్లోకి తీసొకనిరా. ఈ లోగా నేనూ వచ్చేస్తాను!- మరివెళ్ళవోయ్!

క. శే. రా—చిత్తం! [పోవుచుందురు].

దా—అన్నట్టుగ శెట్టీ! ఉ! పోనీ, నేనేకబురంపేస్తానులే! ఇంకా టైముందిలే!-

[అందరు నిష్క్రమింతురు].

# విపరీతవ్యక్తి.

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము.

ప్రదేశము—గ్రామమున మేజస్ట్రీటుగారి విడిదిగృహం.

ప్రవేశం—మేజస్ట్రీటు-బహద్దర్.

బ—[లోననుండి, వసారాలోనికివచ్చుచు, చిరాకుతో]
ఏడెక్కడికి వెళ్ళేడో! రామస్వామీ!

రా—[తొందరగా బ్రవేశించుచు]—చిత్తం దేవరా!

బ—[ఎదటనున్న స్థలమును జూపుచు]- ఏవిరా, ఇదంతా శుభ్రింగా ఉంచొద్దుట్రా?

రా—చిత్తం బాబూ! మునసబుగారు సాకలోణ్ణి పంపిస్తా వన్నారు. అదూవొచ్చేవేళయింది.

బ—సరి! నీవుపోయి, మునసబుగార్ని పిలుచుకొనిరా!

రా—చిత్తం (నిష్క్రమించును).

బ—[పచారుచేయుచు, జేబుగడియారమును దీసి, చూసి],
ఎనిమిదైందే! కబురంపితేగాని వొచ్చేఅలవాటీతనికి లేదు గాబోలు! ఈ మహానుభావు డెలాంటివాడో!—

[అనుచు, ఆప్రక్కనున్న యాసనముపై గూర్చుండి, రికార్డులఁజూచుకొనుచుండును].

[ప్రవేశము దాసుపంతులు-రామస్వామి].

దా—నమస్కారం [నిలుచుండును].

బ—(నమస్కారము నందుకొని), మునసబుగారూ, ఈబస చాలాసౌకర్యంగా ఉంది. ఏమంటారు?

దా— ప్రభువుగారు శెలవిచ్చేదేమో గ్రహింపలేకున్నాను.

బ—ఏమీలేదు, పట్లతోనిండిన పైకప్పుతో బూజులచే నలంకరింపబడ్డ గోడలతో, అన్నివిధాలా, ఈఇల్లు వాసయోగ్యంగా ఉందంటాను.

దా—మహాప్రభూ! మాన్యం అనుభవిస్తున్న చాకలి సోమిగాడు చేసినతప్పిదం ఇది.

ప—ఏమిటీ, వానిచే తీకార్యం చేయించేపాటి నేర్పు మీకు లేదూ?

దా—బాబూ! వాడుపనికిమాలిన పొగరుబోతు!

బ—(ఆలోచించి) ఈగ్రామంలో మాన్యం అనుభవిస్తున్న చాకలి వాడొక్కడేనా?-

దా—లేదు. ఇంకొకడున్నాడు. అయినా, ఈపని యీ సోమిగానికే పురమాయించేను.

బ—వాడాపనిని చేసేడో, లేదో మరిమీరు కనుక్కో అక్కర్లేదన్నమాట.

దా—వాస్తవం. కనుక్కోవలిసిందే! కాగా, వాడాపనిని చేసిఉండడని కూడా బాగా తెలుసును.—

బ—తెలిసి,-

దా—మనవిచేస్తా, అదేపనిని వేరొకడిచేత చేయిస్తే, వాని నడతమీాకు ప్రత్యక్షంగా కనబడ్డవెలాగ,- అందుకని, వేరొకడి కాకుని పురమాయించలేదు, తప్పు క్షమించండి!

బ—మంచిపనిచేసేరు! వానినడత బహిరంగపర్చడంవే కాకుండా, నాకూ మంచిమేలుచేసేరు!

దా—ప్రభువా రాగ్రహిస్తే నేనేం చెప్పలేన్గానీ, ఒక్క మనవి, రెండునిముషాల్లో ఇదంతా శుభ్రంచేస్తా; అంతాసిద్ధంచేసి ఉంచేను. తమరొక్క మారు వాణ్ణి పిలిపించి శిక్షిస్తే, వానిమూలాన్ని గ్రామంలో శాంతి చేకూరుతుందని మనవి.

బ—అలాగా? మునసబుగారూ! ఒక్క-తప్పిదానికి నేను వానిని శిక్షించాలంటారా?

దా—చిత్తం.

బ—అలాఅయితే, వానితోబాటు, ఆలస్యంగా వొచ్చినందుకు మిమ్మల్నికూడా శిక్షించాలన్నమాట! ఏంవలా తెల్లబోతున్నారు? (నగి) పంతులుగారూ! ఇలాంటి స్వల్పవిషయాలా మాకు తెలియజేయడం, మీారే పరిష్కరించాలిగాని,

దా— (నిర్ఘాంతపోయి)- మీచిత్తం! ఇంక, నన్నేమిచేయుమని
శలవ్!

బ—ఏమీలేదు. రామస్వామీ! నేటివాయిదా పడ్డ ఫిర్యాదు
లోని ముద్దాయీలూ వగైరా లెవరైనా వచ్చే
రేమో, పిల్చుకొనిరా!

రా—చిత్తం (నిష్క్రమించును).

బ—మునసబుగారూ! మరిచిపోయేనూ, నాకుమీరు పంపు
తున్న సామాన్లకి జాపితా వేస్తున్నారా? ఏరోజు
ఖర్చు, ఆరోజే నాదగ్గర తీసోకండి!

దా—చిత్తం! కాని, ఇదివరలో ఈఅలవాటు లేదు, అంచేత,
ఇప్పటికి జాపితా వేయలేదు, కాగా, తమకామాత్రం
నజరివ్వడానికి తగదా?

బ—పంతులుగారూ, మీపంధా నాకేవీ నచ్చలేదు! మీ
అలవాట్లతో నాకు నిమిత్తంలేదు. మీనజర్లు నా
కక్కర్లేదు! క్యాంపుఖర్చులకి సర్కారువా రిచ్చే
సొమ్ము మేం మిగల్చుకోడానిక్కాదు, పాపం!
గ్రామస్థుల్ని హింసించ కండి; ఎవరెవ రేవేవిచ్చేరో,
ఖరీదులుకట్టి, వారిబుణం వారికితీర్చాలి! ఇదిగో!
రసీదులుకూడా పొందాలి ప్రతీసామగ్రికి, తెల్సిందా!-
ఇది, నాయాజ్ఞ

దా. పం.—(తెల్లబోయి) చిత్తం!

(రామస్వామీ, కర్రిశెట్టి, ప్రవేశం)-

రా—ఎవరూ, హాజరులేదు, మహాప్రభో!

బ—(వెనుదిరిగి) ఆలాగా! వారంటు పంపాలన్నమాట! ఆ! అన్నట్టుగ, పంతులుగారూ! ఈవూరికి బీటెప్పుడండి!

దా—బీటురోజేమో నిన్ననే దాటిపోయిందండి! అయినా, తమరొస్తారని తెలిసి, తమ తా॥టపాలేంవున్నా అర్జంటుగా పంపమని, సబ్ పోస్టాఫీసుకు తెలుపుకు చేసేనండి!-

బ—సరె! అంతవరకు బాగానేవుంది! నిజంగా టపాలు రావచ్చును గూడాలెండి!- (శెట్టివెపు దిరిగి) ఎవరది?

దా—(వానినివీక్షించి) అతడాండి! ఈగ్రామం చిల్లరవర్తకుడు. పేరుకర్రిశెట్టి, (శెట్టితో) ప్రభువువారితో హాజరు మనవి చేయకుండా ఎందికొచ్చేవ్! నీకేం పనుందిక్కడ, పో, పో, అవతలకిపో!

బ—ఉండండి, పంతులుగారూ! నాదగ్గర ఫిర్యాదు చేయదల్చుకున్నవాళ్ళని నిరాటంకంగా నామొదటకుఁ దీసుకొని రావలసిందని మానౌఖర్లుకు ఇదివరకే చెప్పేను. అంచేత, రామస్వామి యీతనిని తీసుకొని వచ్చియుంటాడు[ ఇది, నాకు సమ్మతఁవే! ఏంశెట్టీ, నీఁవొచ్చిన పనేదో త్వరగా ముగించుకో!

క. శె.—చిత్తం, దేవరా! పెబుకటాచ్ఛం, తమరు ధర్మప్పెబువులని ఇని తవరి సన్నిధికొచ్చేనండి! చిత్తగిం

చాల! పోయిన సంకురాత్రికి అయిదేళ్ళయిందండి, నాసి గ్రామానికొచ్చేసి! మాబాగుగా బతికి సెడ్డోణ్ణండి! ఏదోపదిమంది సాట్నా బతుకుదా వనుకుంటుంటే, యీసాకలోణ్ణుంచి, మాకష్టపడుతున్నానండి!

బ.—సరి! అసలు కథలోకిరా!

దా. పం.—ఏ చాకిలివాడు?

క. శె.—మనవి సేసుకుంటున్నానండి! యీడండి మరేవొచ్చి, సోవిగాడండి మాఇబ్బందెడుతున్నాడండి! ఆడొక్కడే కాడండి! ఈరాంబెర్మ్మం ఓడు నాపాలింటి యమదేవతలా దాపురించేడండి.

బ.—అబ్బా! విషయం తేల్చకుండా వున్నాడు. పంతులుగారూ, ఆరాంబ్రహ్మంఎవరు?

దా.—అయ్యా! అతడు ఈగ్రామం మొత్తానికి పట్నవాసం చదువు పూర్తిచేసివచ్చిన జ్ఞాని. పంచమజాతికి చెందినవాడు, (శెట్టితో) ఉ! బహుక్లుప్తంగా సీఫిర్యాదు, విన్నవించు, గొడవంతా వెళ్ళబొయ్యక!

క. శె.-చిత్తం, చిత్తం, చదువు రానోళ్ళంగందా, ఆ! మనవి సేసుకుంటున్నానండి. నాను సేసేది యాపారంగందండి! ఆరాంబ్రెమ్మంరైతు, ఆడిపేరు పురుగ్గాడండి, ఆడిదగ్గర మొక్కవ్వొలిచ్చి శెనక్కాయలు కొన్నానండి. ఆ, నాను తక్కవ్వొలికి కొందామనుకుంతుంటే, నాచే

రం సెడగొట్టేత్తావా, సూడూ, నిన్నేం సేత్తానో, అంటూ సెడతిట్టేడండి. ఒకణ్ణిగాసూసి, పీకనులివేత్తే యేంసేసేది మారాజా!

బ—సరి, చాకలివాడి కథ మొదలెట్టేవ్?

క. శే. —మనవి సేసుకుంటున్నా మాప్రభో! ఆడుందే, ఆడితో 'ఏవిరా' సాకలోడా, పదిమంది కూకుండేతిన్నె మీాదట్రా మైలగుడ్డ లెట్టావ్, అన్నానా; అందుకాడికి, కోపంవచ్చింది మారాజా! పందొంఅనిసెబుతూ, దుకాణంమీాది సక్కడాలన్నీ తినేసేడు; సరిపోయిందా యెనకాల బాకీ ఇయ్యరా, అంటే, నోటికొచ్చినట్టు ప్రేలేడుబావ్. ఆయెంటనే మునసబయ్య గోరికి మనవిచేసుకొన్నా, ఆగూ—

బ — సరి, నీవేం నేరం చేయలేదు కద!

క. శే. అమ్మతోడూ, మారాజా! కోవటోణ్ణికిదా, సాకలోడితో కలియబడానా?

బ—ఆ! ఫిర్యాదు రాసుకొని తెచ్చేవా?

క. శే. చిత్తం! (ఫిర్యాదు నిచ్చును).

బ—(దానిని చదువుకొనుచు) నీవు నిశానీదారుడవా?

క. శే. చిత్తం.

బ—అట్లయితే, ఇందులో వ్రాయబడినదంతా మీా మునసబుగారూ మొదలైన పెద్దమనుష్యులచేత చదివింపించేవా? దస్తూరీ ఎవరిది?

క. శె. పైవాళ్ళెవరికీ సూపలేదండి! అసలు, మునసబయ్య గారు,-

దా. .(శెట్టివైపు తీక్ష్ణముగఁజూచుచు) వారొకటడుగుతే, నీవొకటి చెప్తావేం శెట్టీ! ఆఫిర్యాదులోని వ్రాయించిన విషయాలు నాచేత చదివింపించేవా? ఏం?

క. శె. (నసుగుతూ) తఁవరాకాగితం చూచేరు కాదా?

దా.—ఉఁ! అదే వారడుగుతున్నారు, చెప్పు వారితో.

క. శె. చిత్తం దేవరా! చూచేరు!

బ.—సరి, సరి! నీవుపో! రేపు నీకేసు విచారింపబడుతుంది. సాక్షుల్ని తెచ్చుకో.

క. శె.—చిత్తం (నిష్క్రమించును).

దా.—పిఱికిపంద బాబూ! వట్టి అమాయకుడు. అంచేతే తక్కువజాతివారి చేతంత చులకనగా చూడబడు తున్నాడు.

బ.—ఆ! ఆలాగా, పాపం!

[ప్రవేశం, పోష్టుబీటు జవాను].

బీ. జ. దండాలు పెబూ [వారిరువురకు నమస్కరించి, ఉత్తర ములు వెదకుచుండును].

బ.—ఏమది? ఎవరికి జాబువచ్చింది? ఉత్తరాలన్నీ వరుసగా పేర్చుకోలేదా?-

బీ. జ. [కంగారుపడుచు, రెండు కవరుత్తరములఁదీసి, వారిరు వురకు చెరియొకటి నిచ్చుటలో, చేతనున్న కట్టను జార

విడిచి, దానిని కాపాడఁజూచుటలో చంకనున్న పాత ఛత్రము నేలబడ, యారెంటిని వణుకుచు కాపాడుటలో, పంచెకుచ్చెళ్ళలో కాళ్లు తొట్రుపడ, తూగుచు, నెట్టకేలకా లేఖల వారికందించి, తిరుగ సలాముఁజేసి, తనసామగ్రులగైకొని బోవును]. [అందరు పక్కున నవ్వుదురు].

బ—అన్నట్టు ఓయ్!-

బీ. జ. [తిరుగ ప్రవేశించును]-

బ—పంతులుగారూ, ప్రత్యేకించి రప్పించినందుకు, యీ బంట్రోతుకు, యీపూట బత్తెంయిచ్చి, నాలెఖ్ఖలో ఖర్చువ్రాయండి!-పోనీ, ఉండండి! రామస్వామీ!-

రా—చిత్తం!

బ—చూడూ! ఈజవానుకి నాలుగణాలిచ్చిపంపు! చిల్లరుంది కదూ, చందుగలో [తాళముగుత్తిని వానికిచ్చును].-

[వారిరువురు నిష్క్రమింతురు].

[పోవునపుడు పోష్టుజవాను తిరుగ నమస్కరించును].

[వారిరువురు కవరులనుచింపి, ఉత్తరముల చదువుకొనుచుందురు].

దా—[చటాలున] మహాప్రభో! వాడు తొందరలో తమ వుత్తరం నాకిచ్చేడు! [బహద్దరున కాయుత్తరము నిచ్చును].

బ—[తన కోసంగబడిన కమ్మలోని విషయముల నాశ్చర్య
ముతో జదువుకొనుచు, నాడుత్తరమును గ్రహింప
కయే] ఎవరు రాసేరో చదవండి!

దా—[క్రింది సంతకమును గాంచి] ఏ. ఎల్, ఎమ్, మోహన్
అని ఉంది ప్రభూ!

బ—సరి, సరి, ముద్దాయీలప్లీడరు, వాయిదా కోరిఉంటాడు!
ఇలా తెండి! [పరాకుతోడనే చేయిజాచును].

దా—[ఆవుత్తరము నందించును] తమకిచ్చినది, నాపేరవచ్చిన
వుత్తరవేమో ప్రభూ!

బ—లేదు, లేదు! ఇదికూడా నాకు సంబంధించిందే! [రెండిం
టిని తన జేబునం దుంచుకొనుచు]— పంతులుగారూ?
ఆరామబ్రహ్మం పంచమజాతికి చెందినవాడా!
గ్రామస్థులతో సఖ్యంగా ఉంటాడా?

దా—బాబూ! కుడిచేతికీ, యెడంచేతికీ భేదంలేదా? నిదానం
మీద అన్నివిషయాలూ ప్రభువులవారికే బోధ
పడ్తాయ్! కొన్ని నిముషాలక్రింద నామాట తోసి
రాజన్నారు! ఇప్పుడు సోవిగాడినడత కొంచెమైనా
బయటపడ్డాదా? విచారణలో అన్నీ విశదమౌతాయ్!

బ—అవును, నిదానంమీద అన్నీ బయల్పడుతాయి లెండి,
వాస్తవంగా! కానీ, గ్రామాధికారులైనమీరు, తగు
శ్రద్ధతో, మూఢులైన వాళ్ళక్షేమం గోరాలేగాని,
వాళ్ళతోటి కక్షుపూనుతే ఎలాగ?

దా—చిత్తం! తమరు సెలవిచ్చింది, నిజవే, కాని, సోవిగాడి మీాద నాకేం ద్వేషంలేదు. వాడజ్ఞాని, ఆ రామ బ్రహ్మం చెప్పినట్లువిని, అన్నీ తనపీకల్మీదికే తెచ్చు కుంటాడండి.

బ—ఆరామబ్రహ్మానికీ మీాకూ తగాదాయికి తగ్గ కారణా లేవిటీ? వానికి మీారేం కీడుచేసి ఉంటారు?

దా—అదే, వాని తెలివి తక్కువండి! నేనేం కీడుచేయలేదూ! జాతస్యపంచముడుగదాని, మాతో మాట్లాడేటప్పుడు దూరంగా ఉండమన్నానండి! దాన్తో, తనకున్న జ్ఞానాన్ని ప్రకటిస్తూ, చిత్తంవచ్చినట్లు మాట్లాడుతూ, మా బ్రాహ్మణ్యాన్ని దూషించడం మొదలెట్టేడండి!

బ—అంచేత మీారు పరుషంగా మాట్లాడి ఉంటారు!

దా—లేదు, మహాప్రభో! వానియహంభావం కనిపెట్టి, వానితో ప్రస్తావనే మానేసేను.

బ—అంటే, వానిని సంఘంనుంచి బహిష్కరించేరన్నమాట! ఇది మీాపొరబాటుగాదా?

దా—అయ్యా! నాదొకమనవి! అతడు మాట్లాడేదంతా మత విషయం కూడదూ అన్నప్పటికీ మానకుండా ఉండడం, వానిది తప్పుకాదా?

భ—నిజంవే! నాకూ, మతవిషయం చర్చ అవుసరంలేదూ,

అసలువిషయానికిరండి! సరి! అతనిని విసర్జించేరు, తర్వాత ?

దా—తర్వాతేంవుంది? ఆకారణాన్ని నామీద కట్టుకట్టి!—

బ—ఆగండి, మరిచిపోయేను. అసలు, అతనిని మీరొక్కరే బహిష్కరించేరా, మీ గ్రామంలోని బ్రాహ్మణ్యాం అంతానా?

దా—అందరం బహిష్కరించేం.

బ—ఆలాంటప్పుడు అందర్నీవిడిచి, మీ ఒక్కరిమీదే కార్పణ్యాం వహించడానికి తగ్గకారణవేవిటి? (తల నూపుచు) మీసమాధానం నాకు నచ్చలేదు!

దా—ప్రభువులవారు,—

బ—ఉండండి, ఉండండి! రామస్వామీ, చూడూ, లోపల, మార్జాలచక్రవర్తిగారు కబోలు, సంచారం చేస్తున్న ట్లుంది!

(రామస్వామి ప్రవేశించును.)

రా—చిత్తం! (బోవును.)

రా—(వెంటనే ప్రవేశించి) బాబో, రాండి! నాబారతో రెండుబార లుండవచ్చును—

బ—(కంగారుతో) పామా? (ప్రక్కనున్న చేతికర్ర గ్రహించి, పరుగెత్తును). (రామస్వామి వెంబడించును.)

ధా—ఒరే, ఎవఁడా, అక్కడ! కురనన్నా! డోలుపైడనా! వెధవలెవరూ కానరారే! బాబూ! మంత్రాలమారయ్యని పిల్చుకొనిరానా? (రెండవదారిని బోవుచు, ఆగి)- ఇదో ముండిఘటంలాగుంది! కానీ! (తలనూపుచు) చటాలున మనస్సిచ్చి మాట్లాడకూడదు, బెడ్డవేసి లోతుకనుక్కోనేరకం! గొప్పమాటకారి! [నగి] ఎంత! ఒక్కనిముషంలో లొంగదీస్తా!

(నిష్క్రమించును).



లాగుకొనుచు, లేచును. పురుగాడు తూలి, నేలను పడ
బోయి, ఆచుకొని, వానిపై కుఱకబోవును]-

సం—(పెనగులాడుచు)-ఏం(టో గొల్లనంజాకొడకా! నీపెద్ద
రికవేంటో సూత్తానులే, కానీ! (పైకుఱుకును).

పురు—(ఊపు నాపుకొనుచు, లేచి) ఆ! రారా! మొగాడివి
(డీకొన సిద్ధముగనుండును).

రా—ఇంతలో చేరువకరుదెంచి)- పురుగ్గా, తొందరపడకు,
ఏంజరిగిందేఁవిటి?

పురు—సూడండి, బావ్, యీాడూ!-

సంకు—గొల్లనంజాకొడకా! ఎంతదెబ్బ కొట్టేవురా?
(కొట్టును).

దా—(దూరమునుంచి ప్రవేశించుచు) ఎవరక్కడ, దెబ్బ
లాడుకుంటున్నారూ? [సమీపించి]- ఇదిగో! రాం
బ్రెహ్మం, నీవుండికూడా, వాళ్ళలా దెబ్బలాడుకుం
టుంటే వూరుకున్నావా?

సం—[దాసుపంతులు పాదాలమీాదపడి, యేడ్చును].

దా—[వానిని లేవనెత్తి] ఏవిరా? ఏంజరిగింది? దాచకుండా
చెప్పు!

సం—బావ్, సమయాని కొచ్చేవ్! నేకుంటే, ఆళ్ళిద్దరూ
నన్ను కూనీ సేసేత్తురన్నమాట!

దా—ఉఁ! సరి! [రామబ్రహ్మమువైపు కోరగజూచి]- ఓయ్!
అసలేం జరిగిందో చెప్పు!

సం—మారాజా! నానేవో, ఆగట్టెగేసు కొంతుంటే, యీ గొల్లాడొచ్చి, గడ్డిమీఁద్జేసి, ఆ చాపాటికఱ్ఱతో చిత్తం వొచ్చినట్టు బాదేడండి! [పురుగ్గాడు, అదేకఱ్ఱను గ్రహించి, గెడ్డముకింద బెట్టుకొని తలనూపుచుండును].

దా—[పరిహాసరూపంగా] అవ్వనూ! మరీ, మొదాట, వీళ్ళిద్దరి మీఁదా నేరం మోపేవ్?

సం—మరికాదా పెబూ! ఆరాంబ్రెహ్మంగోరు దూరాన్నుంచి యీఁడ్ని పురిగొల్పేడుగాదా!

పురు—ఉఁ! చెప్పరా, నీమనుకొచ్చినట్టబద్ధాలూ! చెప్పూ-పెబువుల్కి తెల్దూ!- ఆ-కాదూ-మాపొలంలో మన్ను మీఁదకెగేయడాన్కి నీకేం అదికారం వుందీఅంటా!

దా—సరి! వానికందు కధికారం ఉందో, లేదో, అసలు వాణ్ని కొట్టడానికి నీకేం అధికారంవుంది!

పురు—నాను కొట్నేదే? అఘలు,-

దా—నోరుముయ్! ఏం రాంబ్రెహ్మం! మాట్లాడవేం? ఎంత చదువుతే, ఏంలాభం? అజ్ఞానంచేత వాళ్లిద్దరూ కొట్లాడుతూంటే, ఊరుకో బెట్టలేకపోయావా? అందులోనూ మేస్ట్రీటుగారు మకాంచేసి వున్నారనైనా ఆలోచించేవూ? వాడిపుడు మీఇద్దరిమీఁదా ఫిర్యాదు చేస్తే ఏం చేయం—

రా—అయ్యా! ఆగండి! తమరేమో ఎక్కువవారే, గ్రామాధికార్లు! అయినా, అన్నివిషయాలూ విచారింపకుండా, మాట్లాడుతున్నందుకు, నాకు విచారంగా ఉంది! మీరు శెలవిచ్చినట్లు వాడు ఫిర్యాదుచేస్తే, అన్నిసంగతులూ బయల్పడ్తాయిగాని, న్యాయాధిపతులు మీలాగ సంచరిస్తారని నేననుకోను!-

దా—ఓహో! చల్లనిమాటల్తో తూలనాడుతున్నావ్, నీకు మాటలల్లడంలో చమత్కారంఉందని మాకు తెలుసు! ఇంతట్లో చాలించు!

రా—అయ్యా! మీరు అకారణంగా కయ్యాన్ని బెంచదలుచుకున్నట్లు కనబడుతోంది, ఒక్కరైతుమాటల మీద ఆధారపడి మీఇష్టంవచ్చినట్లు తీర్పుచెప్పడానికి తలుచుకుంటే, నేనేం అందుకు జబాబుదారీ వహింపలే......

దా—ఓయ్! రాంబ్రెహ్మం! ఇది రెండోమారు, నిన్ను నేను హెచ్చరిస్తూన్నాను! నీనోటికి వచ్చినట్లు వదరుతున్నావ్!

రా. బ్ర—ఏంవండీ, ఉభయపార్టీలవారూ చెప్పింది విచారించవొద్దా! అని నేనడం వదరుబోతుతనంవా?

దా. ప.—ఉష్! నీవేమో గొప్పమాటకారి వనుకుంటున్నావ్. పోనీగదా, ఏదో కొడ్లాడుకుంటున్నారు,

ఎవరో, ఆపుచేద్దాం, అనుకొని వొచ్చేను, నేచెప్పి నట్లు వినకవుతెమానె. ఇట,

రా—మీాపనికేం లేదని నేననుకుంటాను.

దా—ఆ! అవును, నాపనికేంలేదు, ఇక్కడ! నేవెళ్తాను. కానీ, ఈనేరం న్యాయస్థానంవరకూ పాకిరేటప్పుడు,

రా—మీా చిత్తంవొచ్చినట్లు సాక్ష్యవిస్తారు, అంతేనా?

ధా—ఓహో! తొందముదురుతోందే! ఏదోలా మాపు చేద్దావనుకొని వచ్చినందుకు ఫలితవిది. కానీ, ఓయ్, నీపేరేవిటి?

సం—బాబూ, తెల్దా, సంకులుగా డంటారండి!

ధా—ఆ; ఆ! సంకులూ!నీకాకావాలంటే, జరిగినంతా మేస్ట్రీటుగారితో ఫిర్యాదుచేసుకోవచ్చును. అవసరమైతే నేను చూసినంతా సాక్ష్యవిస్తానులే, పో! ఆపైని మీాఇష్టం. [చటాలున నిష్క్రమించును].

సం—(వెంబడించుచు) కటాచ్చించాల బాబూ! తప్పకుండా ఆడిమీాద (కొంతదూరమేగి), ఏం! సరా!

దా—(క్రూరపునవ్వు మెల్లగ నవ్వి; తలనూపుచు) ఆ! పాచికపారింది, పో!- (బిరబిర నడచుచు, గ్రామాభిముఖముగ బోవును).

(దారిలో, ఒకచోట, కనకమ్మ పొంచున్న స్థలము నుండి, బైట కరుదెంచి, వానిపై మెటికలు విఱిచి, పండ్లు కొఱికి, నిర్ఘాంతపోయి చూచుచుండును).

సం—సిత్తం, సిత్తం, (వెనుకకు మరలిఁబోవుచు)- ఆ! ఈడు నన్ను కొడ్తాడా! (సణుగుకొనుచు, దుఃఖము నభినయించుచు, వారల కనతిదూరమునుండి, బోవును).

(సంకులుగాడు వెడలునంతదనుక, రామబ్రహ్మము, పురుగ్గాడు నిర్ఘాంతబోయిఁ జూచుచుందురు)_

రా—(నిట్టూర్పువుచ్చి) పురుగ్గా! కనిపెట్టేవా, వాళ్ళ వాళకం! ఇదంతా దాసుపంతులు కుమ్మక్కు మీద జరిగినదని నేను ముందరే గ్రహించేను. అంచేతే నిన్నప్పుడలా ఆపుదలఁ జేసేను.- బోధపడిందా?

పురు—ఆ! తెల్సింది బావ్! ఎందుకూ, మేస్ట్రీటు బాబిక్కడేఉండాడూ, బతికిపోనారు. నేకుంతేనా, ఇద్దరికీ రేవెట్టేద్దును.

రా—(నాలుక కఱచుకొని) అన్న, ప్రమాదం! మన వెప్పుడూ నేరస్థులం కాకూడదు! చూడూ, పిలిచినట్లు, ఇట్టే పొడిచినంతమాత్రాన్ని ఎంత పెంచేడో గ్రంథం? పడ్డవాళ్ళెప్పటికీ,—

కన—(ఉన్నట్టులుండి, వీరలున్న దిక్కున కరుదెంచుచు) అన్నయ్యా! గొప్పపొరపాటుచేసేవు సుఁవా!

రా—[ప్రక్కకు తిరిగి] ఏం పొరపాటు? ఏవిషయం?

క—[సమీపించి] చేఁజిక్కినవాణ్ణి విడిచివేయడం పొరపాటు గాదూ?-

రా—కనకం! ప్రస్తుతం జరిగినవిషయంగురించేనా మాట్లాడుతున్నావ్! రా! ఇంతసేపూ ఎక్కడున్నావ్! నీయభిప్రాయాన్నే యీపురుగ్గాడుగూడా సూచిస్తే, ఇప్పుడిప్పుడే తొందర కూడదని వీణ్ణి హెచ్చరిస్తున్నాను.

క—కాబట్టే, ఆకుర్రకుంకలా నీమీదంత అధికారం చెలాయించగల్గేడు.

పురు—ఆ! అదే సత్తెము,- [సత్యము].

రా—అమ్మడూ! చదువుకొన్న నీవూ మూఢత్వం బూనుతావనుకోలేదు.

క—అన్నయ్యా! ఇల్లు నడిపట్టేవరకూ కాలిపోయినా, ఆజ్వాలల్ని ఆర్పడానికి దలపెట్టకుండా ఉన్నావ్! ఇంతవరకూ నేచెప్పేదంతా పెడచెవిని పెట్టేవ్! ఇంకా పరీక్షిద్దాం, ఇంకాపరీక్షిద్దాం అంటూ, పీకబంటి తెచ్చుకున్నావ్! వానిదృష్టిలో నీవో చచ్చుపెద్దమ్మవిఅయిపోయేవ్! ఇంకా అశ్రద్ధచేస్తే ఆపాపాత్ముఁ డెంతైనా చేస్తాడుగాని విడుస్తాడా? బాగావ్యవహారాలు ముదిరిపోతే నువుచేసేదేఁవిటి? వానిచిత్తంవొచ్చినట్లు చెలరేగి పోతున్నా, నీవు-

రా—[చలింపక, చిరునగవుతో] కానీ, చెలరేగనీ! అలా రేగి, రేగి, మనల్ని దిరగదొయ్యడానికి అనేకగోతులు తవ్వుతూ, ఏదో ఒకదాంట్లో తానేపడతాడు! మనమెందుకు తొందరపడి నేరస్థులం కావాలి?

క—సరి! సరి! నీకేమో నిదానంగానేఉంది! కాని నాకు మాత్రం క్షణమొక యుగంలాగుందిసుమా! ఆనీచుడు మనల్ని కష్టపెడుతూ తాను సుఖంగా ఉంటే, నాకుమాత్రం సహించదు, నేను ఓపికపట్టి ఉండ లేను!

రా—పిచ్చిదానా! వానికి మాత్రం సుఖంవేదీ? ఈరామ బ్రహ్మాన్ని ఎలావంచించడం? ఆకనకమ్మని ఎప్పుడు, ఎలా, తనదానినిగా చేసుకోవడం? అని ఆజీవుడెలా రాత్రింబవళ్ళు తహతహపడుతుందో కొంచెమైనా ఆలోచించేవా?

కన—అన్నయ్యా! నాది స్త్రీహృదయం! ఈ ఉదయంనుంచి వాళ్ళిక్కడ తారడం చూసి యేదో ప్రళయంఉందని ఊహించే నేనూ ఉషారుగానే ఉన్నాను. నీవు చెప్పింది కాదనలేను, కాని, వాడుచేసిన తప్పిదానికి ప్రతిక్రియ, ప్ర-[ఒత్తుచు] ప్రతిక్రియచేయాలి, చేసేతీరాలి. [అనుచు, పైటలోపల గుప్తపరచిన వాడి బాకును బైటకుం దీయును].

రా—[నిర్ఘాంతబోయి] ఆ! సాహసం!-[ఏమియు ననంజాలక, ఉచ్ఛ్వాసనిశ్వాసల, విడచి, నిట్టూర్పుతో]-దైవసహాయం! సంతోషం, కనకం, నీవు తొందరపడకేడు!-

కన—[రామబ్రహ్మమునకు ప్రణమిల్లి] నాఊహ, తప్పై

ఉండొచ్చును! వాడు మీాపై చెయిజేసుకొనడానికి తలపెట్టిఉంటే, తప్పకుండా, యీ ఆయుధంతో రంగం లోకి ఉరికేఉందును!-లేదా,—

రా—అప్పటికీ,......

కన—అన్నయ్యా నీవింత శాంతమూర్తివి, కాబట్టి, నీకోరిక ప్రకారం, నీఉద్దేశాల్ని అనుసరించి నడవవల్సిన భారం నామీాదఉంది కాబట్టి ఆగేను,- [చటాలున, ఏదో జ్ఞప్తికివచ్చినటుల తుళ్ళిపడి], అన్నా మరిచి పోయేను, తలుపులు ఓరగాపెట్టి, తొందర్లో వొచ్చే సేను.-

రా—అవునవును! అలా ఎప్పుడూ చేయకూడదు!

పురు—నిజవేఁబావ్! చోడీగింజాలయీా ఉన్నాయా, చటా లున ఆళ్ళే జొరపడితే?

కన—సరి నే వెల్తాను. నీవుమాత్రం వేగిరం తిరిగిరావాలి!

రా—సరే, వెళ్ళు, రెండు నిముషాల్లో వచ్చేస్తా; ఒక్క- సారి, ఆతోటదాకా వెళ్లి. ఎందుకైనా మంచిది, పురుగ్గా నీవుకూడా యీాపెతో ఇంటికే వెళ్లు.—

పురు—ఓ, సిత్తం-రాండమ్మా.—

[పు· కనకం_ఇరువురు గృహాభిముఖు లౌదురు).

రా—(వారి క్రొత్తతోటవైపు జూచుచు)-అవును! నిజమే! వాళ్ళన్నదాంట్లో సత్యం లేకపోలేదు. [ఆగి, ఆలో

చించి] అయినా, శాంతమే, శరణ్యం. శాంతమే తుదకు జయాన్ని పొందుతుంది. వేదవాక్కు వృథా కాదు! ఆ! అదుగో! గరుడుడుగూడా. 'జయం, పల్కు తున్నాడు!- శాంతమే శరణ్యము!- ఓ! పరమేశ్వరా! ఇప్పట్లోనైనా, ఇప్పుడే, నాలో, ఒక్క నాలోనే కాదు,- మా హిందువులందరిలోనూ నిదానం, శాంతం జొర పెట్టి మమ్మల్ని రక్షించవా?——

పాట, [పాడుచు బోవును].

(శాంతమును గూర్చి).





# విపరీతవ్యక్తి

## ద్వితీయాంకము.

### తృతీయరంగము.

స్థలము:—ఊరివెలుపల, కొలనునకు చేరువలోనున్న బయలు స్థలము.

(ప్రవేశము (1) దాసుపంతులు (2) కరిశెట్టి)

దా. పం. ఛీ! బుద్ధితక్కువ పనిచేసేను. కుక్కతోక పట్టుకొని, గోదావరి యీదడానికి తలపెట్టేను, అందులోనూ వరదలకాలంలో (చిరాకుతో వడివడిగ బోవుచుండును)

క. శె. [వాలి వెనువెంట, చేతులు, నులుముకొంటూ, వచ్చుచు, వినయముతో]- నేనేం నేరం సేసేను బాబూ! తవరు సెప్పినట్టు,—

దా—[చటాలున వెనుదిరిగి, శెట్టినోటికడ్డముగఁ జేయి నునిచి] మెల్లిగా మాట్లాడు, మూడువంతులు [నలు దిక్కులు పరికించి] వారీదారంటే షికారువస్తారు.

[పోబోవుచు] ఉ! పో! నీవు చెయ్యవల్సిన సహాయం నీవు చేసేవ్ [ముందునకు సాగును].

క. శె. [వెంబడించుచు]– బాబో! నడిసంద్రంలో విడిస్తే సస్తానా బ్రతుకుతానా? అత్తలా బేరంపోయె; చెప్పి కొన్నానుకానా, మొదట్లోనే,—అసలే పిరికోణ్ణి, నన్నిడిసేయండి మారాజా, అని! ఇప్పుడు నాగతేం కాను మారాజా! దారిసూపండి మారాజో!

దా—అన్నా! పీకల్మీదికి తెచ్చేటట్లున్నావే! [వెనక్కి—ఒక్కడుగిడి] నేచెప్పేనుకానూ, అలాచెయ్ బాగా! వెలలు బిగించి వేగిరం జాబితాలు తయారుచెయ్! వానికదే మందు! చూద్దాం! ఉ! పో! నువ్వు నాతో ఉన్నట్టు గతనికంట బడకూడదంటే నీక్కాదూ! అరె! పొమ్మంటే పోవేం! [మరలి పోబోవును].

క. శె. చిత్తం! అంతా మీ సేతుల్లోనేఉంది! తవురే రచ్చించాల!

దా—అన్నా! జడ్డోడుతావేం శెట్టీ! ఇప్పట్లో ఊరుకుంటే, ముందు నాఉద్యోగానికి స్వస్తి! తర్వాత, జైలు! తెలుసా! వెళ్ళు!– రాత్రి మాయింటికిరా! అంత పాఠం నేర్పుతా! ఉ! కదలవేం?

క. శె. ఏవో, తమశెలవ్! [బెదురు చూపులతో నిష్క్రమించును].

దా.—అమ్మయ్యా! [ముందునకు పోబోయి]- ఇదే విహారానికి అనువైనస్థలం, పట్నవాసంవాళ్లు యిలాంటిస్థలంకోసం ప్రాణాలిచ్చేస్తారు[ తప్పకుండా వాళ్ళిక్కడికే వచ్చితీరాలి! చూద్దాం, ఆతుప్పల్చాట్నుండి వాళ్ళేం మాట్లాడుకుంటారో వినాలి!- [యాప్రక్కనున్న తుప్పలమరుగున కేగును].

[కొంతకాలమువరకు ఇరువురు ముగ్గురు మార్గస్థులా దారి నేగుదురు].

[దాసుపంతులు మాటిమాటికి తొంగిచూచి, మరుగునకు బోవును].

[ప్రవేశం—బహద్దర్, కురవడు].

బ—[ఆయాసముతో బ్రవేశించి, ఒక్కచోనిలిచి జూపోయుచు] అబ్బా! ఎంతదూరం వీడ్చుకొచ్చేవురా, నీఇల్లు బంగారం కానూ!

కుర—ఏదీబావ్! నిండా రెండుమైళ్లొచ్చేం! తమవంటి పెబువులు కూకోడాని కింతకంటే మాంచిసోటు మరోటిక్కడేదండీ!

బ—నిజమే! ఈప్రదేశం బహు రమ్యంగాఉంది! ఆ! (ముందునకుం జూపుచు] నువ్వుచెప్పిన కొలనుఅదేనా?

కు—నిత్తం బాబయ్యా! రాండి! ఈబండమీాద కెక్కిసూత్తే అంతాపూర్తిగా కాప్పడుతుంది [ఆబండను సమీపింప

బోయి] నేకుంతే, అందకోనేటిలో దిగుదాం వొత్తా రేంటి, మరి పదిబారలే గందా!

బ—అవును. గాని, కురవన్నా, దేన్నైనా దూరంనుంచి చూసి ఆనందించాలిగాని, తీరా చేరుకుంటే అందులో నేం సొగసులేదు సుమా! రా! [బండను సమీపించుచు] చూడూ! ఒక కోలంగోవావో, సువర్ణరేఖో, గులాబ్ జామో, ఏదో ఒకరకం, మంచి నవనవలాడే మామిడిపండుం దనుకో! ఏం?

కు—[వెంటబోవుచు] సిత్తం, శెలవివ్వండి!

బ—[బండపై కెక్కుచు] ఆపండుని, అలాఉంచి చూస్తూంటే ఉండేసౌఖ్యం, తీరా తినేసేక ఉంటుందీ? [బండనెక్కి పైమీది కండువా నటబరచుకొని, దానిపై కూర్చుండును].

కు—(వెనుక ప్రక్కనుండి యీబండనెక్కుచు) చెస్! (బండ నెక్కి ఒక ప్రక్కకు చేరుకొనుచు) వాస్తవం మారాజా! చక్కగా చెలవిచ్చేరు! కయిత్తం సెప్పేవోడిలా మా సెప్పేరు పెబూ సదువు కున్నోళ్ళు గందా!

బ—వెధవా! కవిత్వంకూడా యెక్కడ విన్నావురా?

కు—సేనాదిక్కుల యిన్నాను మారాజా! అదుగో! అటు కాసి సూడండి, ఆకోనేటిమీద సెప్పేడండి! పద్దేల్తూ ఆరాంబెత్తిమ్మం, మీనాగే సదిగేసేడండి!

బ—స్వంతవేనా, ఒకరురాసినవి చదివేడా?

కు—నేదు బాబూ! సొంతవే! చూడండి! ఆచపటాకట్టే టప్పుడూ, కలకటేరు దొరొచ్చేడూ! ఆదినం, నిల్చున్న పాట్న, గుక్కతిప్పకుండా, వొర్ణించేసేడండి! నానుండీ యీపాటీద్నుండేవోణ్ణి! ఇసుకూల్లో, అయ్యవోరూ, "గడనగల మొగనిగాంచేన" అనేపద్దెం, ఒప్పసెప్ప మంటే, మూడుసెరువుల నీళ్లుతాగి, ముప్పతిప్పలు పడేవోణ్ణిగందా, యీడెలా సదిగేడ్రా, ఇన్నిపద్దేలూ అనిపించింది, మారాజా, సెప్పకేం! ఉండండి! ఆడిలా గొత్తే సదవమందాం, ఇందురుగాని! చిత్తగిత్తుండా రూ? (తొంగి, ముందునకు జూచుచు) ఏటీసాదని ఆలోసిత్తుండారు కామోసు!

రా—ఆ! ఆ! చెప్పు! 'రామబ్రహ్మం మంచికవి!' అంటావ్! ఆ!

కు—నిబ్బగ, మారాజా! చూద్దురుగాని, యీదారివొత్తాడు గంద.

బ—ఆ! ఎందుకు?

కు—అదేంటి? ఆతోటారిదేగంద! ఈసెరువు తవ్వించినపు డాళ్ళతాతే యేయించేడూ;—ఇపుడు దాన్ని బాబు బాగుసేయిత్తుండాడు.

బ—ఆ! ఆచెరువు రామబ్రహ్మంతాత త్రవ్వించిన్దా?

కు—అలా, అనే మాఅయ్య సెబుతుండేవోడు, ఆడికేం గావాల అబద్దవాడిన్దాకా!

బ—అయితే, దాసుపంతులు (గారి) తాత త్రవ్వించింది కాదూ?

కు—నేదు మారాజా! ఆరి తాతగారి దసలీ గేమవే కాదంట!

బ—ఉ- హూ! అలాగా? అయితే, దాసుపంతులు గొప్ప కోసం, అలా డంబంగా చెప్పేడన్నమాట, నాతో!

కు—చిత్తం, కావోసు.

బ—ఎందుకలా చెప్పిఉంటాడూ?

కు—సిత్తం!—

బ—అన్నట్టుగ! రామబ్రహ్మన్ని చూస్తే అతడికి గిట్టదట కాదూ!

కు—సిత్తం.

బ—ఈ రామబ్రహ్మంకూడా గ్రంథకర్తలా కనబడు తున్నాడు.

కు—చిత్తం.

బ—కర్రిశెట్టితో పోటీకివచ్చి వానిని ఏడ్పిస్తున్నాడట, నిజవేనా?

కు—సిత్తం.

బ—(విసుగుతో) ఏవిటీసిత్తం, ప్రతిప్రశ్నకూ 'సిత్తం' వేనా?

కు—సిత్తం దేవరా!(వణుకుచు, వెనుకకు తగ్గి నిలుచుండును)

బ—(మరింతవిసుగుతో) అన్నా! మళ్ళా అదేనా?

క—(మరింత భీతితో)- సిత్తం, చెమించాల!

బ—(నగుమోముతో) ఒరే, కురఁవా, భయపడకు! నిన్నే మన్నాన్రా, నేనూ?

క—(సర్దుకొని, నాలుక సవరించుకొని) పెబువులువారు సిత్తగిత్తే ఓటి మనవి సేసుకొంతా!

బ—ఉఁ! చెప్పు పర్వాలేదు! చూడూ! ఒకళ్ళకి హానిచెయ్యడంనామతంకాదు. నీమూలంగా కొన్నిసంగతులు తెలుసుకోవాలి, చెప్తావా?

క—సిత్తం, గానీ, మెనకటిమాారాజులుగూడా, యీనాగే, కిటుకుసేసీ, కూపీ సెప్పినోళ్ళపీకలమీాదికే తెచ్చేవోరండి! అంచేతా,-

బ—ఓహో! అదా నీభయం! పోనీ, యీరోజంతా నాతోమెసిలేవుగదా! నన్నామాత్రం గ్రహింపలేకపోయేవూ! ఒక్కటిసెప్తా, వినూ! అందరూ సఖ్యంగా ఉండి కాలం గడపాలనేసుమా, నామతం.

క—సిత్తం! రాంసోయిబాబు సెప్పేడు, పెబూ! తవరందుకే పెతీయిసయంలోనూ రాజీ సేయిత్తుంటారంట!

బ—ముఖ్యంగా నీబోటి యజ్ఞానుల్కి ఏకీడూ రాకుండా సహాయపడ్డవే నాకు మంచిదిలా తోస్తుందిరా!

క—దర్మప్పెబువులు మాారాజా! నేకుంతే, సదువుకున్నాళ్ళ సిక్కులూ,టక్కులూ మాఁవేంగ్రెయిత్తాం మాారాజా!

తవరెదట సెప్పకూడదుగానీ, ఇందర్ని సూసేనూ, తవరినాగ మనసిచ్చి మాట్టాడిన మారాజుని ఒక్కర్ని నాను సూడ్నేదంటే నమ్మండేం?

బ—దానికేంలే, నన్ను మించినవాళ్ళు లక్షలున్నారు! (ఆగి) ఏమో, నలుగురికీ నచ్చనీ, మాననీ, హెచ్చుతగ్గులాలోచించక, చాకలమంగళ్ళకిసహితం చనువిచ్చి వాళ్ళమేలుకోరుతూ సంచరించడమే మంచిదని నా ...ంరా!

క—కాదా, పెబూ! ఆళ్ళసాక్కెం సూడక, తవ్వరూ, అంటే,- పెబువులూ- టెక్కుసేసి, బిగించుక్కూకుంతే,- ఏనంజాకొడుకు- మరిగంతే,- మాసాకలి మంగళ్ళమాటనేండి- ఆ!- పానంయేసి, నౌఖరీ సేత్తాడు, బాబూ! అందుకేగందా, దాచుబుగత కెవరూ యెట్టీసేయరు!

బ—అతడు, మీపట్ల అంత నిర్దాక్షిణ్యంగా ప్రవర్తిస్తాడా? పాపం!

క—మరేంబాబూ! ఆరితో సెప్పకండేం! అయినా, యీ యిషయాలు సాటుగా మాట్టాడుగుంటే,- (బహద్దర్ దృష్టి వేరొకప్రక్కనుండుటగాంచి)- అదేంటిబాబూ! యెారొత్తుండారో, అట్నుంచి! [తానును ఆప్రక్కం జూచుచు] మరెవర్నేదండీ! అమ్మయ్యా! నానుబయపడ్డాను, ఆడు సాకలి సోవిగాడండీ!

[ప్రవేశము- దూరంనుంచి, భాగవతపువరుసను పాడుచు సాకలి సోవిగాడు]-

పద్యము.

పుట్టితివె కపిల కులవున
కట్టితె సేతువు కడలిని కవివాంశ నిదీ
పట్టుతో దెచ్చితె చీతను
పట్టెద నీ చె-ర-ణా-వు ల ను-పావన చరితా॥

(క్రింది గీటులుగలతావుల దీర్ఘముదీయుచు, పాడుచు, రాగము నాలాపించుచు, వీరలున్న దిక్కునకే, నెత్తిని కట్టెపుల్లలమోపు నిడుకొని, తూగుచు, వచ్చుచుండును).

(ఇంట వీరిరువురు నాపాటను అత్యుల్లాసముతో వినుచుందురు).

బ—(పాట ముగియునంతనే) వెధవ మాంచినిషాలో ఉన్నట్లుంది!

కు—మరేంబావ్, సెడతా గేసినాడండి!

బ—(ఆదిక్కునకే చూడ్కినిగిడించి) ఆ! ఇలా వొస్తున్నట్లే ఉంది. కొంతసేపు కాలక్షేపం అవుతుంది.

(మరుగుననున్న దాసుపంతులు చెవులునిగిడ్చి వీరి సంభాషణ వినుచు, సమయానుసరించి ముఖలక్షణ

ములలో ననేకమార్పుల గనపర్చుచు నావేదన బొందును).

కు—సిత్తం, గానీ, బాబో! ఆడ్ని కదపకండేం. నోరుజారి కారుకూతలు కూత్తాడు.

కు—అంటే, అసభ్యంగా మాట్లాడ్తాడా?

కు—అంటే, మారాజా?

బ—బూతుమాట్లాడ్తాడా? అంటూ!

కు—తవరొంటోర్ని సూత్తే, నిషాలోఉన్నా, మాజాగ్రత్త గుండాడుగానీ, 'నీవ్వూ, ఆడూ' అంతాడండి.

బ—సరి! అంతేనా, త్రాగినతిమ్మిర్లోగూడా వాడు మనల్ని మన్నించాలంటే, జరుగుతుందా, ఫర్వాలేదులే.

కు—సిత్తం, పెబువు మనచు.—

బ—అన్నట్లుగ, కురవా! నీకేవైనా అలవాటుందీ?

కు—[నసుగుతూ] పెబువులదెగ్గర అబద్దవెందుకూ! ఉన్నాది గాని, ఆడంత ఉమ్మిరినేదు మారాజా! ఏదోపండగా, పరంవొత్తే,- కూసింత- తాగుతానండి!

బ—నిజఁవే, ఎవరీవిత్తనం వేసేరోగానీ, మనదేశంలో, చాలాలోనాగా వ్రేళ్ళూదన్నిందీ, ఇపుడు- [ప్రక్క-కుఁ దిరిగి], కురవా! అదుగో! వాడా ప్రక్క-కు పోతున్నాడు, మెల్లిగా ఇటు పిల్చుకొనిరా! ఉఁ!

కు—పిలవడవెందుకు బావ్, ఆడేవొత్తాడు.

బ——అని, నీవెలా చెప్పగలవ్!

కు——మరికాదా, మారాజా! ఇదుగో! ఇటుకాసే ఆడికే వుంది. అక్కడికెల్లడానికే ఆడు కంపతెత్తాడుండాడు.

బ——రాత్రి పడుతోందే!

కు——కాని, మారాజా! మూణ్ణాళ్ళుండి, ఆడు మునచబర్యతో తంటాలడుతున్నాడుగందా!

బ——అ! ఆ! (శ్రద్ధతో వినుచుండును).

కు——ఇయాళ, మాటమీాదమాటొచ్చి, ఆడంటాడూ, "అ! ఇయాళేయాళకైనా, ఆరిబట్టలు గుంజి-యిచ్చేత్తాను గానీ, పల్లకుంతానా!"- ఆ!

బ——ఉండుండు! నువ్వన్నట్లు వాడిలాగొస్తున్నట్లుంది. ఇదుగో! ఒక్కమాట! వాడు నన్నిదివరలో చూడలేదుకాబట్టి నన్ను పోల్చుకోలేడు. నేను, 'ఫలానా' అని మాత్రం వాడితో చెప్పకు, వాణ్ణి విచ్చలవిడిగా సంచరించనీ, ఏం? తెల్సిందా?

కు——సిత్తం, పెబువు మనచు!

(ప్రవేశం——చాకలి సోమిగాడు)

సో——(చరచర ప్రవేశించి, చటాలున ఆగి, నిదానించి) ఈ ఆడోళ్ళని పుట్టించమని ఓరుసెప్పిందీ, అంతా! నేకుంతే, లంకంతా కాల్పించిన్దెవురూ?- నా రామయ్యతండ్రికి కట్టాలు తెచ్చిందెవరూ? చీతమ్మతల్లేనా? (ఆలోచించి)అయి తేమాంచిపతివ్రత!ఓ!నాసత్తిగూడా

పతివ్వాతే, చెన! అందమ్మోర్ని, నామాలచ్చింకోండనీ,- యీసాకలిసత్తితోనా పోత్చేది, ఇది మనిసీ!- ఆ! ఇలాంటాడోళ్యా-ఆ! తెల్చింది, తెల్చింది, ఈఆడోళ్లు నేకుంతే నోక వేనేదు! ఆకనకమ్మగోరుండమట్టేగందా ఆదాచుబుగత (నవ్వుకొనుచు) ఓరి, నారంగా, ఆడి సిగ్గుచివడా- అదీ, మాల్ది- యీడో, బా-పనో-దూ- ఓలవ్వ! (త్రేన్చి), యీమాట పెగిలేతల్కి-, పేనా లెక్కోచ్చేయ్! ఆ! (వెనుకకు మరలి) ఓరుసెప్మా, పిలిసిందీ! ఆ తెల్చింది, అరదవయింది! (తనహృదయాన్ని ఉద్దేశించి) ఓరీ, సాకలిసచ్చినోడా! అదుగో! ఆమాలచ్చివిని తూలనాడేవ్! అదుగో! బూదేవి. అందులోఉంది, చీతమ్మావోరు. ఉ! దండవెట్టి, తప్పు కాయుమని, యేడుకో! (నేలపైవంగి, నమస్కరించుచు)-తల్లీ! తాగినోడితోటి తగువేంటని నీకుమాత్రం తెల్దూ! రచ్చించాల! కాపాడాల! మరీ, నానంతాను గందా, నానూ, నాసత్తినీ, తాగొచ్చి తన్నేనంట! ఎంతసత్తెవో, యీతగువుతీర్చాల! (చెవియొగ్గి. వినునటుల నభినయించి) ఏంటీ, నీకూ సాచ్చెంకావాలా? సచ్చేనాప్రి, దేవుడా! ఎవురుసిక్కుతారూ, నాకిపుడూ (నలుదిక్కులు పరికించుచు, బహద్దరునుగాంచి), అదుగో ఎవడో మారాజున్నాడక్కడ! (తప్పటడుగులతో, వారినిసమీపించి) నువ్వెవడో నాకుతెల్దుగాని,

నువ్వుతీర్చాల, యీతగువు!- (బహద్దరు పాదముల పట్టుకొనును).

బ—(చలింపక) ఓ! తప్పకుండా! లే! చెప్పు!

సో—[లేచి, పాదములువదలి] ఆ! నిబ్బగ! మరైతే, నాను తాగినానుగందా,-ఇపుడూ- తాగేనా, నేదా? ఉ! సెప్పు!

బ—[తెల్లబోయి, యాలోచించుచు]- అవునవును, నువ్వు చెప్పిందే నిజం.

సో—ఆ! అలాసెప్పాల! మరైతే తాగితే తప్పా! ఒకటే మాట! టీక్, సెప్పూ!-

బ—అబ్బే, తప్పేంలేదు. కాని, డబ్బుదండుగకదా, ఎందుకు తాగేవూ?

సో—[విస్సాటంగా] పోస్! నువ్వేంసాచ్చెంవుండావ్! తాగ డందండగా? నువ్వుతాగనే! నువ్వు కాపీతాగుతే, నాను కల్లుతాగుతాను. ఇద్దరంతాగుతాం! ఏం? నేదూ? సెప్పూ, ముందర! [మీదకుబోవుచు] పోనీ, సూస్కో, సవాల్! రా! ముంతెడు కల్లుచ్చుకొని, మునుకుడునీట్లో- మూడుగంటలుండి, మూడుమూటల గుడ్డలు గుంజుతాను! ఏం, పందెవేత్తావా? [కట్టెల మోపునుదెచ్చి, ఆముందర విస్సాటముగవైచి, బహద్దరునకు ఎదురుగా నతిచేరువలో భీష్మించుకొని కూర్చుండును].

[బహద్దరు నవ్వుకొనుచు, ప్రక్కకు తప్పుకొను చుండును]-

సో—[లేచి, చేయిఁజూచుచు] ఓ! నాకు తెల్చీయేసాలు! నాను కదల్నిచ్చేదినేదు బాబో! ఒక్కటేమాట! మొగోడివైతే,- "యెదవా! నువు సేసిందితప్పూ!" అని సూపించాల! అందాకా నానొగ్గేదినేదు.

[బహద్దరు చిరునగవుతో కురవనివైపు జూచును].

కు—[అందలి ఇంగితమును గ్రహించి, ముందున కరుదెంచి] ఓరి, సోవిగా! పైవూరునుంచొచ్చేడుగందా, యీబాబు కేంతెల్సురా! అన్నట్టుగ, ఇయ్యాళ రేవుకెళ్ళేవురా? ఆరిగుడ్డలు గుంజిచ్చేసేవురా?-

సో—ఓరి, మంగలితొత్తుకొడకా, నువ్విక్కడున్నావంట్రా! మేస్త్రీటుబుగతనొగ్గేసి!-ఉ!నువ్వుసేరుకున్నాక,మరాడికి మతుండేదేంటనే [విస్సాటముగా మరలబోయి, కాళ్ళకు కంపతగుల్కొన, జోగి, బండపైబడబోయి, ఆచుకొని] నాకంపో, కంప! [మోపును సర్దుచు] చెస్! యీళ్ళకేంతెల్సా, అంతా! అద్దో, నామారాజూ! రాంబ్బొమ్మం! ఇట్టే తీర్సేయడా, నాచందేగాలు! ఆర్ని అడుక్కుంటే, నాలుగు మావిడిపుల్లలుఁ గూడా ఇత్తాడు! [మనస్సునందేదియోపసణుగుకొనుచు మోపును పరిపరివిధాల సర్ది గట్టుచుండును. ఈవింత

నవలోకించుచు, వానిచర్య నింకను గనిపెట్టువానివలె బహద్దరు వానినేఁ జూచుచుండును]...

[ప్రవేశము- రామబ్రహ్మము]

రా—[దాసుపంతులు దాగుకొనియున్న తుప్పప్రక్కనుండరుదెంచుచు, నాతఁడున్న తావుదాటి, వీరలగాంచి, వేరొకదిక్కునకు పోఁ బోవుచు నటనాగి, దాసుపంతులును బహద్దరును ముమ్మారుఁజూచి, ఆవలప్రక్కనున్న చెట్టుపై చూడ్కి నిగిడించి] పాపం! ఈరెండు పక్షులూపొంచున్న వేటగానిని గుర్తించకుండా, ఎంత విచ్చలవిడిగా విహారిస్తున్నాయి! [తల నాడించుచు నిష్క్రమించును].

సో—[రామబ్రహ్మమును గురుతుపట్టి] అదుగో, నారాజు! బాబో, తాలండి! మీకోసఁవే సూత్తుండాను [మోపు నెత్తి నెత్తుకొని, యాంతఁడు బోవుచున్న దిక్కునకు బరుగెత్తును].

రా—[ఆగి, వెనుదిరిగి] రారా, సోవిగా! ఏం? [మరల బోవుచుండును].

సో—సిత్తం, వొత్తుండాను, మరిగంతే, ఒక్కచందేగం. [వానిని వెంబడించును]—

[సోమిగాడు 'బాబో!' అనగానే, బహద్దరు ఉషారుపడి, రామ బ్రహ్మమువైపు చూడ్కిమరల్చి, ఏదియో దీర్ఘముగ

నాలోచించుచు, నలుదిక్కులు పరికించుచు, తల నాడించును].

బ—[ఆ వెంటనే బండదిగి, చటాలున] అతడేనా, రామ బ్రహ్మం?

కు—[కంగారుతో, బండదిగి] సిత్తం, మరేం బాబయ్యా, పిలమని చెలవా?

బ—వొద్దొద్దు! ఆ! [నిదానముగ నాలోచించి, యోచించి], కురవా! నువ్వన్నట్లు అతడొక కవియై యుంటాడు సుమా!

కు—సిత్తం! అందుకే ఆర్ని పిలుత్తే, యీకో నేటిమీద సెప్పిన పద్దేలు పెబువువారినొచ్చునుగందా!

బ—ఉఁ, ఉఁ!- ఇది సమయం కాదు, రా! చీకటిపడేవేళయింది గ్రామంలోకి పోదాం!

కు—సిత్తం! కానీ, మారాజా! మళ్ళా గేపకం సేసేరుగా మట్టి మనవి సేసుకొంతున్నా.

బ—ఏవిటీ?

కు—[నసుగుతూ] బాబూ, సెప్పేనుగందా, నాకు పద్దేలిన్డ వంటే మాసరదాండి!

బ—వెధవా! అయితే నన్ను చదవమంటావేంటి?

కు—అంటే, సదువుకొన్నాళ్ళుగందా, తవరో పద్దెం ఈకోనేటి మీద సెబితే ఇనాలనుంది. [వణుకుచు పాదములపై బడును].

బ—బాగుంది, ఇదిట్టా సమయం?

కు—నేకుంటే, మాం వినేదెపుడు, మారాజా! అలా సూత్తుంటే తవురు సెప్పలేరుగనకనా?

బ—వెధవా! గట్టిచిక్కు తెచ్చేవురా? పద్యాలల్లడవంటే, నాకూ ఇష్టవేగాని, నిల్చున్నపాట్న చెప్పాలంటే, మంచివర్ణన రాదురా! కాగా, అలవాటొకటుండొద్దా? [ఊరికే వచనం వదరేవాళ్ళం]

కు—ఏదో మారాజా! ఈమంగలోడికూడా అరదవయే• నాగుంతే సాలదా? అంతా—తెలిచో, తెలీకో!

బ—అవున్లే! చాకలిమంగళ్ళకూడా అర్థవయేలాగే పద్యాలల్లాలిశే! పోనీ, ఏం కోరేవుగనక,— మళ్ళామాన్యాలా?—ఒక్కపద్యంకద! విను చెబ్తా! [కోనేరును, ఆపరిసరప్రాంతాల్ని పరికించుచు, నిదానముగా నొక్కనిముషమాలోచించి] వినరా!—

సీ. ఈపక్క నాపక్క నింపొప్ప మొలచిన
గుట్టల వికసంపు గుంపుతోడ!
నీరంబుగోర్లంగ సిస్సురిస్సురనుచు
బర్వెడు పశువుల బంతితోడ!
తుంపర్లమింటికిఁ దూలెడు మీలకై
తారెడు బకముల బారుతోడ!
చల్లగాపీచెడు పిల్లగాలుల కల్ల
నల్లన నూగెడు నలలతోడ!

గీ. సొంపు చోద్యంపు, చెలువంపు టింపుతోడ
గూర్చు పాంథుల కానందమేర్చు; యిట్టి
కొలను పొలిమేరనుండంగ, కురవ! యేమి
నోములన్నీదు గ్రామంబు నోచుకొనెనొ!

కు—(ఆనందముతో) బాబో! నాపేరుగూడా కలిపేసేరే!

బ—(నగి) భయంలేదు, రారా! చీకటిపడుతోంది (గ్రామాభిముఖముగ నడుగులిడుచు, సాగుచుండును).

కు—మారాజా! కండువా! (పరుగుపరుగున మరలి, కండువాను గ్రహించుచు), వా, నిజంగా, యీ పెబువే, పెబువు (అత్యుల్లాసముతో, దాట్లువైచుచు, బోయి, బహద్దరును కల్సుకొని, కండువానిచ్చుచు)మారాజా! రాంసోమిబాబుగూడ వుంటేనా, ఎంతానందించునో, చావాన్లకాడొగ్గేసేరుగాని) [వెంబడి నేబోవుచుండును] (బహద్దరు, వీనిపలుకులను పరాకుగ వినుచు, ప్రక్కప్రక్కల పరికించుచు, నేదియో నాలోచించుచు బోవుచుండును. దాసుపంతులుమాత్ర మగుబడడు)—

(వీరిరువురును కొంతదూర మేగునంత మెల్ల మెల్లన తుప్ప చాటునుండి దాసుపంతులు బైటకరుదెంచును).

దా. (నిట్టూర్పువుచ్చి, తీక్ష్ణదృక్కులతో) సరి! శృంగార వనమనుకొని, నట్టడివిలో జొరబడ్డాను. లేడిగా భావించి, పెద్దపులికంట బడిపోయేను! ఉ! ఇక, తప్పుకొనేదారి వెతుక్కోవాలి!- ఈకురవడా! సరి! (నిదా

సముగ్గ నాలోచించి) అబ్బ! మనస్సు పరిపరివిదాల పరుగెత్తుతోందే! (కండ్లుమూసుకొని, ఆలోచించుచు పిచ్చియెత్తినవానివలె దిరుగాడుచు, చటాలున) ఆ! అదేదారి! (చరచర నడచుచుండును).

సంకు—(వెనుకనుండి ప్రవేశించుచు) బాబూ బుగతగోరూ!

దా—(చటుక్కున వెనుదిరిగి, సంజ్ఞచే, వానిని చేరువకు బిలిచి) పో! పో! గోడకుచెవులుంటాయ్! తిన్నగా, మాఇంటికిరా, యీగకంటైనా పడకుండా! నన్నెవుడూ బహిరంగంగా కలుసుకోకు! ఉ! వెనక్కి మరలిపో!-ఇప్పుడు నేను వెళ్తున్నదారంటేనా రావొద్దు! (చరచర నిష్క్రమించును).

సంకు—(నిలబడిపోయి)—అన్నా! ఈఫిర్యాదు యెప్పుడు దాఖల్ చెయ్యడఁవో? (ఆలోచించి) మాపిటికి బుగత గోర్ని కల్సుకుని, ఆర్ని అడుక్కున్నాకే దాఖలు సేత్తా! ఇంతలో మునిగిపోయిందేం నేదు!—

(వెనుకకు మరలిఁ బోవును).



# విపరీతవ్యక్తి.

## ద్వితీయాంకము.

### చతుర్థరంగము.

స్థలము:—చాకలిసోమిగాని ఇంటిముందరి వసారా (చావడి).

కాలము:—శుక్రవారము నాటిరాత్రి, షుమారు గం॥ 7 లు.

ఆ వసారాలో ఒక్కప్రక్క, గోడదరి, ఒకటేబిలుపై చలవజేయబడినట్టియు, చలవచేయబడనట్టియు బట్టలుండును. ఒకప్రక్క కాలవేయబడిన ఇస్త్రీపెట్టె యుండును.

[ఆటేబిలునకు ఒకప్రక్క తుక్కినులక మంచమును, దానిపై నొకగోనె, పర్కిక్కబట్టలు, పాతవి, యుండును).

[లోపలినుండి, చాకలిసోమిగాడు, కట్టుకొంగుతో, మూతియు, కుడిచేయియు దుడుచుకొనుచు, నోటనింక నుండిబోయిన మెతుకుల నెమరువేయునటుల నమలుచు ప్రవేశించును.]

సోమి—(ఆమంచముదరి నాగి, త్రేన్చి, క్రూరముగ నాటేబి లువైపుఁజూచి, నిలుచుండి), ఆ! ఉత్తనే యిడుత్తా నా? సత్తి (లోననుండి, చేతనొకగిన్నె బట్టుకొని ప్రవేశించుచు) ఓయ్!

సో—(వెనుదిరిగి), ఏం?

సత్తి—ఏంనేదూ, నన్నుపిల్చినావుగంధా!

సో—(విరగబడి నవ్వుచు) ఇదో సడసం గావోసురా, దేవుడా!

స—నీసడసం మరీ బావుందినే! నన్ను పిల్నేదూ?

సో—ఆ! ఇంకా సెప్పా!

స—అబ్బా! ఏడిపించకుమావా! ఉండుండు, [లోనకేగి, చేతనున్న గిన్నెనుబడవైచి, తిరుగ నరుదెంచుచు], చెశ్! ముండాబేపి, దీన్తగలెయ్యా, కాళ్ళలోపడ్తాదీ! [చేయి నామంచముపైనున్న బట్టలతో తుడుచుకొని, సోమిగాని చేరువకుబోయి, వానిబుజముపై నానుకొని] మావా, సెప్పవ్! పిల్చేవా, నేదా?

సో—[నవ్వుచు] ఇంకా మెనకాతలి సాదేనా? పోనీ, రానే వొచ్చేవ్. రా, కూకో, కూంతనిల్చే మెల్తాను [యీ కుక్కిమంచముపై కూర్చుండును. ఆ ప్రక్కనే కూర్చుండి, సత్తివానితలలోనిపేలనుఁజూచుచుండును].

స—ఏంమావా! పల్లకున్నావేం? నువ్వ్యాసులాడుతూంటే, నామనసూ,.........

సో—[ఆప్రక్కకు మొగముతిప్పి] ఒటీ! పులకరిత్తుంది గావోసు—సంజాయేసాలు!

స—సో! లోపలొకటీ, పైకొకటీ, నిజంసెప్పవుసుఁవా?

సో—అడగ్గానే సెప్పేత్తే ఏంతమాసాఉందీ, అంతా! సూడూ, ఆదాచుబుగత పిలగ్గానేవొచ్చేత్తే, ఏం రంజుంది?

స—ఓగూ, కనకమ్మగోరేనా?—అయితే, ఇకముందేనా వొత్తుందేంటి?

సో—ఆ! ఆడిముక్కూ మొగం సక్కన్నూసీ,—బలవంతం సేత్తే, సెప్పలేంగాసీ,—

స—[సోములు ముఖమును తడుముచూ, జంకుతో]—మన చుండబట్టక అడుగుతానూ, మావా! పంతులుపేరు సెబితే ఎందుకలా మండిపడిపోతావ్?

సో—అదుగో, కదిపే, అవ్వూసూ!—ఆ! నీకేం తెల్చా,— ఆడిపాట్లు ముందున్నాయి సూడూ! [లేచును].

స- -లేత్తావేం? [లేచి] ఆ, తెల్చింది, అదా? ఇవుడెల్లి ఆబట్ట లిచ్చి వొత్తావా?

సో—ఓ! [మీసముదువ్వుచు] మారాజులా. నాకేం? రాత్రి నా? మళ్ళాతన్నడవే? సూడూ—నామజా!

స—[దరిఁజేరి, బుజముపైనానుకొని, వంగి, నిలుచుండి] మాపిటేల, సల్లగకూకొని ఊసులాడుకోకుండా, ఎందుకొచ్చినపెంట, యిదంతా? తెల్లారేకా? తప్పదూ, నువ్వూర్లోనూ, నానుపొయికాడ!

సో—ఆ! అయితే?—

స—[దీనముగ జూచుచు] నేదు, మావా. నాకుమాత్రం తెల్దూ, యెక్కడికేనా యెల్తుంటే, యెల్లొద్దంటూనా? ఎల్లినావంటే,- అందయ్యా దుడుసుగా మాట్టాడుతాడు నువ్వా, తెగించి ఉన్నావ్? ఎంతాలస్యం సేత్తావో? నువ్వొచ్చిందాకా నా పేనవెలా కొత్తుకుంటుందో తెల్సా!—

సో—[ఒక్కనిట్టూర్పువుచ్చి, ఆలోచనతో]- అయితే ఏం • సెయ్యమంటావ్?

స—ఏఁవన్నా, కోప్పడవుగంద!

సో—అ ఆ! నేదునే, సెప్పు! [చెయిపెనవైచి, ముంగురుల దిద్దుచు నిలుచుండును].

స—అయినా, ఎక్కువోరుగందా! ఆరితోమన కేం! ఆరొకటి కొడితే నీకేం తక్కువొచ్చింది! ఇంటున్నావా? ఇదో, అటుకాసేం సూత్తుండావ్ [వానిచేతులను బట్టుకొని, వానిమొగమును తనప్రక్కకు దిప్పుకొనుచుండును].

సో—[తలతిరుగ నిస్త్రీబల్లవైపుద్రిప్పి] పాపం! ఆ! దాని ఆయువు మూడిందీయాళతో! [ప్రక్కకుదిరిగి] ఆ! దానికేంలే! సరి! సెప్పు! నీకథేదో!

స—[అటువైపు జూచుచు] ఆ! ఏంటీ? ఆజోరీగమాటేనా?— సూడూ, దానికేం పోగాలవో సెప్పూ!

సో—ఏంటీ సొద?

స—నువ్వు తెచ్చి పెట్టినేనా? సూడూమరి! ఆసాలీడంత పెద్ద పురుగా! దాంతో [ఆగి] ఏంపల్లకుండావ్!

సో—[లోననుండి యరుదెంచు నవ్వునాపుకొనుచు] ఆ! ఇంకా,—

స—ఇత్తగద్దుందిగదా, దాన్తోపోరాడి, ఇది నెగ్గగల్దూ? [యేదో నిశ్చయించు కొనినటుల తలపంకించి] ఏం, మావా? పోనీ; దానికెన్ని కాళ్ళున్నాయో సూసావా?

సో—ఓబోలెదు [నవ్వుచు] కానీ, సెప్పూ, కనిపెట్టేన్లే! నీటక్కు టమారి, గజకర్ణ గోకర్ణ యిద్దెలన్నీ సూపెట్టూ—పట్టంపిల్లవి గందా!

స—మావా! నమ్మవుగాని, ఎన్నడూ నేందీ యీ ఇసయంలో నువ్వేం మాటపడ్తావో అని మాకొట్టుకో పోతూంది, సుఁవా, యీపేనం!

సో—కడాకు నువ్వనే దేంటీ? దాచుపంతుల్కి—కూడా అన్నీ మాయలు తెల్సునంటూవ్, అంతేనా?

స—[నసుగుతో] మరేం మావా!

సో—ఓ, ఉండనీ, సూడూ, యీ సోవినాయిడు కాడ.—ఆ! [తలపాగానుదీసి, తలవెంట్రుకలఁజూపుచు] ఇన్ని ఉపాయాలున్నాయ్. ఈడూకానుకోగల్డు, తెల్సిందా, నాతథాకా. ఆడీముత్తాతలు దిగిరావాలి.

స—కేకలెట్టకు, సంకులుగాడా బుగతకి లొక్కువ, తెల్సా!

సో—[మరీగంభీరంతో] ఓ, ఇనసీ! ఇది జడిసేగటంకాదేవ్. ఆడిముంగలే అంటాను, నాకేం బయంనేదు.

సంకు—[వీధిలో నిలుచుండి] ఏంట్రో, అలపొద్దుకాడ్నుంచి సూత్తుండానూ, ఆడోళ్ళకాడ ఏంట్రో కూత్తుండావూ? (కొంచెము ముందున కరుదెంచి) రా, రా! సవాల్ సేత్తుండానూ, యీముంగల రాసీరా నీబిగుళ్లేంటో

సో—సత్తీ! సూత్తుండావా? అణ్ణిబొట్టెట్టి పిల్చిందెవురూ? మనం, మనం మాట్టాడుకొంతుంటే, ఈమద్దెకిరాడానికి ఆడికేఁవక్కుంది?

సంకు—ఓ! మాగురించి సెప్పుకొంతుంటే వొత్తానా, వొచ్చి సూత్తానా? రా, సేతనైతే యీదిలోకి!

సో—[ముందున కరుదెంచి] పొప్పొస్! ఊరుకోక నువ్వు సేసేదేంటీ అంట! [నిరసనతో] మెళ్ళెళ్ళు! నీదిక్కున్నకాడ సెప్పుకో, నేనిలాగన్నానని,-

సంకు—అదే, సూత్తావునే, నాను సేసేదేంటో? ఇదుగో, సత్తెమ్మా, సూత్తుండావుగందా, ఆడిపొగరు, నీసల్లని మొఖంసూసీ, ఇరుగూ పొరుగూగందాని, నానెంత తవకాయించుకొన్నా,-

సత్తె—అన్నా, తెలకడుగుతానుగందా, "మాం, మాం" అంతావూ! "మామీద సెప్పుగున్నా" వంతావూ, దాచుబుగతకీ, నీకూ, ఏంసుట్టరికఁవుందీ, అంతా!

సంకు—ఓహో, సత్తెమ్మా! యీడితో మొసలమట్టి,

నీకూడా కళ్ళునెత్తికెక్కేయ్.

(చాకలిపెద్దవచ్చి వీథిలో కొంచెము దూరములో నిలుచుండి యీవాదన వినుచుండును).

సో—అదుగో, అడితో సేరమట్టి ఆడికుళ్ళుగుణాలు నీకబ్బడ్డాయికాదూ! యెళ్లా, ఆట్టేపేలక.

సంకు—ఒరేయ్, సాకలోడా. నీఅంతరవు తెలీకుండా నోటికొచ్చినట్లు మాపేల్తున్నావ్, కాచుకో! గేమం! బుగతమీద కూస్తున్నావుగా, నూస్కో, నాతమాసా, బొక్కలో తోయించకపుతేనా, యీడు సంకులుగాడు కాడను? [బిరబిర బోవుచుండును]-

చాకలిపెద్ద—[అడ్డువొచ్చి]- ఓయ్! సంకులూ! సాకలోడు, సాకలోడని, మాకులాన్ని నిందిత్తున్నావ్; వంటో నీ పెద్దరికం!-

సో—ఆ; మావా, నీసెవుల్తో నీఁవేగందా, ఇన్నావ్; సూత్తుండావా, ఇంటో జొరపడ్డానికీ, ఆడోళ్ళని తూల్నాడ్డానికీ, యీడికేం.

సంకు—మరాడు సేసిందేం గెయించొద్దా?.

చా. పె. ఇదో, నానోటి సెప్తానిన్కోండి! యీపాలైతే కాసేనుగాని, ఇంకోపాలి, మాజాతి పేరెత్తేవంటే, నిల్దీసి తప్పుచ్చుకుంతా!

సంకు—అచలు చమాచారం యిచారించొద్దా?

చా. పె. అదంతా, మాకెందుకూ! మీరూ, మీరూ యెలా

సహో, ఉరెట్టుకొసావండి!- ఇదో! సోవిగా! ఆబుగతో మెవ్వారం తెంపేసుకొన్నావా, నేదా?—మరారి గుమ్మం తొక్కకూడ్దు తెల్చిందా?

సత్తి—ఇదో, ఇవుడెల్లి ఆరిగుడ్డలిచ్చేసొత్తాడ!

సంకు—ఇంతేగందా! ఓ! మీాసిత్తంవొచ్చినట్టు మీారు సేసుకోండి! నాను సేయవొల్సిందేదో నానూ సేస్కుంటాను! (సణుగుకొనుచు బోవును).

చా. పె—ఓరి, సోవిగా, ఆడెళ్ళి మళ్ళాఇదంతా అక్కడ వెళ్ళబొయ్యకముందే మెల్లి, మెవ్వారం పైసల్ చేస్కునిరా!-

సోవి—ఓ! తయ్యారుండాను (మూటను సర్దుచుండును).

సత్తి—మాావా! నెక్కెట్టినూస్కు! ఒక్కపేలికైనా ఇడమోకేం!

సో—ఉఉ! నేదునే! (మూటను బుజమునకు తగిలించుకొని) మెల్లిరానా?

సత్తి—ఆ! అక్కడమాత్తరం మల్లారంది పెంచుకోకేం!

చా. పె—ఆ! ఆడికేం మతోయిందనుకున్నావేంటి! చక్కగొచ్చేత్తాడు, సోవిగా! నాబంగా మెల్లిరా!-

(ఆదారినే మంగలికురవడు బోవుచుండును).

చా. పె—అదో! కురవన్ననాగుంది! ఏంమాావా! బాపనీదినుంచేనా, రావడం?-

కు—(ఆగి) ఏం?—

చా. పె—ఏంలేదూ! దాచుబుగతింటికాడున్నాడో, లేదో తెల్చునేఁవో, అని.

కు—ఆ! ఆరి యీాదిఅరుగుమీాద కూకున్నాడు, నాను సూసే సరికి!-

చా. పె—ఆ! ఇదేచవయం! గుడ్డలిచ్చేసిరా! ఇదా, అవు చరవైతే ఓబుగతని మద్దినిడుకోని, మరీ...

సో—ఓ! నాకు తెల్చా- (నిష్క్రమించును)-

(కడమవారందరు ఎవరిదారినివారు నిష్క్రమింతురు. సత్తి, సోమిగాడు కనుచూపుమేర దాటువరకు అచటనే నిలుచుండి, దీనముగ లోనకేగుచు, (దేవుడ్నేడా! అనుకొనుచు లోనికేగును)-





# విపరీతవ్యక్తి



## ద్వితీయాంకము.



### పంచమరంగము.

స్థలము—మాలపీథిలోని పఠనమందిరము.

రామబ్రహ్మము—(సరస్వతీపటమునకు ప్రక్కగకూర్చుండి, కండ్లుమూసుకొని ధ్యానించుచుండును).

బా. బై—(యరుదెంచి, మెల్లమెల్లన యడుగులిడుచు లోన ప్రవేశించి, శ్రీదేవికి నమస్కరించి, ఒకప్రార్థనాశ్లోకమును మనస్సునందే పఠించుచు, తన్మయంబున, మెల్లగ) "విద్యాదానకరీ మమ" (అని బైటకుచ్చరించును).

రా. బ్ర—(చటాలున కన్నులువిచ్చి, బాలబైరాగికి ప్రణమిల్లి) గురుదేవా! నమస్కారము. ఎంతసేపైంది, తమరరుదెంచి? కూర్చుండుడు.

బా. బై—(కూర్చొనుచు) ఇప్పుడే.

కనకమ్మ—(పూజాద్రవ్యములగైకొని యరుదెంచి, పఠము నలంకరించి, దూపదీపనైవేద్యాదులొసంగి, హారతి యిచ్చును).

బా. బై. రా. (బ.—భక్తిశ్రద్ధలతో నిలుచుండి, దేవికి ప్రణమిల్లి, ప్రసాదాదులగైకొందురు).

క—కొంత ప్రసాదమును, పళ్ళెరమునుగైకొని నిష్క్రమించును).

బా. బై—(కూర్చొనుచు) రామబ్రహ్మం! ఇట నిర్జనత్వం యథావిధిగనే జరుగుచున్నది, కదూ?

రా—ఆ! కాని, అతనికిసంబంధపడనివారుమాత్రము, చాటుచాటుగవచ్చి, వార్తాపత్రికలమాత్రము పఠించుచున్నారు.

బా. బై—పోనీ, వైరముమాత్రము బెట్టుకొనకు, ఆదేవియొక్క కృప త్వరలోకల్గి, సర్వకార్యములు, స్వభావసిద్ధముగనే సానుకూలపడును, (లేచుచు) నేను,...

రా—(లేచి) మీరైన మరికొంతకాలము...

పురు—(పరుగుపరుగున ప్రవేశించి) బాబూ! ఇటుసూశారా, యీాయింత!

రా—(నిర్ఘాంతపోయి) ఏవిట్రా?

పురు—ఏఁవడిగేరూ, మళ్ళాకలియబడ్డారంట, అంటే, కొట్టుకోడం నేదంటనే.

రా—ఆ! ఎక్కడ?

పురు—ఆరింటికాడే.

రా—వీడెందుకువెళ్ళేడూ అక్కడికి?

పురు—గుుజేసినగుడ్డ లియ్యడానికట.

రా—ఆ! పోనీ, ప్రమాదాలేం లేవుగద!

పురు—సరిపోయింది, యీడికి పేనంయిసిగిపోనంత జరిగిం దంట, ఆపైవాడూ, డబ్బాడవాలా కట్టేత్తుండాడు.

రా—అంటే?

పురు—మరేటుంది, యీగేమం యిడిసి, ఆడత్తోరున్న గేమం పోతాడంత. తవరితో టలా మనవిచేయమన్నాడు.

రా—అరె! వీడికేం మతిపోతూందేంటి? రేపు కేసువిచారణ! నువ్వు బోధపర్చలేకపోయేవూ?

పురు—నానుసెప్పిన్ది ఆడినేమాటుంటే, తవరికాడికి నానెందు కొత్తానూ? ఇంకానయం, చరిగ్గా నానాదారంటేగ మట్టి!

రా—సరి!-

బా. బై—రామబ్రహ్మం! నువ్వు త్వరగాపోయి, వానినాప వలెను. లేనిచో నేరస్థుడగును.

రా. బ్ర—అదే, ఆలోచన! మరి నాకు శెలవ్!

బా. బై—ఉ! నేను నడుస్తున్నా (నిష్క్రమించును).

రా—పురుగా! నువ్వెళ్ళి యింటిదగ్గరుండు!— ఉ!— (నిష్క్రమించును).

పురు—సిత్తం! (నిష్క్రమించును)-

నౌఖరు—[లేచి, వారివెంటనేగి మరల నట కాపుండును].

(తెర).

# విపరీతవ్యక్తి.

## తృతీయాంకము.

### ప్రథమరంగము.

ప్రదేశము:—పల్లెటూరిలోని బ్రాహ్మణవీధి!-

[ప్రవేశము- బహద్దర్, రామస్వామి].

(రామస్వామి దీపమునుచేగొని దారిచూపుచుండ, బహద్దరు బహుజాగ్రత్తగ నడుగులిడుచు నడచుచుండును).

బ—(పోవుచు) అబ్బ! ఈముండాగ్రామంలో బ్రాహ్మణవీధే ఇంత ఛండాలంగా ఉందికదా, కాపవీధులింకా గోతగాఉంటాయికబోలు! ఒకరికీ, ఈగ్రామారోగ్యం మీాద శ్రద్ధ లేదుగాబోలు.

రా—[ఆగకయే] బాబూ! అంతాగ్రామంమునచబులోఉన్నది మాలపల్లి సుబ్రంగా ఉన్నట్టుతోస్తోంది, ఇంతకంటే!

బ—నువ్ చూసేవ్రూ? —

రా—చూచేను పెబూ, యీాపొద్దున్నే పలకారపుల్ల లక్కనుండే తెచ్చేను.

[వేలిముసుగు వైచుకొని, బహద్దరును తప్పుకొనుచు కనకమ్మ బోవుచుండును]-

బ—[చటాలున ఆగి] రామస్వామీ! చూడూ! పాపం, ఎవరో; ఆడంగులాగుంది, దీపంచూపించూ!-

రామ— [అట్లు చేయుచు] నిదానవమ్మా! దారి బాగు నేదు. [కనకమ్మ కనిపించుకొనకుండ, అప్రక్కనున్న చిన్న కాలిబాటనుబట్టి, ఒకసందులోనికి బోవుచుండును]

రా—[ఆదిక్కున కొక బాటయున్న సమాచారము దెలియక, బోవుటచేత] ఏవమ్మో! ఆగమ్మా! అలాతప్పదారడి పోతావేం? [త్వరత్వరగ నాపె వెంటజనును].

క—[ఆగి] ఎవడునువ్! నేనెలావెళ్తేనీ కేం! దూరంగాఉండు.

బ—[చరచరబోయి] అమ్మాయీ! ఎందుకాకోపం? దేని కాబెదురు? నీ కేంభయంలేదమ్మా! చూస్తే, ఉత్తమ కులం బిడ్డలాగున్నావ్! ఇంతచీకట్లో ఒంటరిగా వెళ్ళడం ఖర్మవేమమ్మా నీకు!

క—అమ్మయ్యా! (ఆగి) అయ్యా! ఈదారులు మాకుపరిచిత మైనవే! మీరెవరో క్రొత్తకాబట్టి లాంతరూ పటాటోపంతో వెల్తున్నారు! మీకరుణకి చాలాసంతోషం. చాలాతొందరగాపోవాలి, నాకుసెలవియ్యండి.-

రా—అమ్మా తెలీక అడుగుతాను,- అంతబెదురెందుకూ?-

క—ఉన్నాయిలే, కారణాలు, మీ కెందుకూ!-

బ—సరే, అమ్మాయీ! అయితే, ఒక్కటిఅడగవచ్చునా?

క—ఓ, న్యాయమైన విషయమైతే!

బ—ఏపీ లేదూ, నీ పేరు?

క—కనకమ్మ అంటారు. ఇక వెళ్ళవచ్చునా?

బ—ఓ! సరి! రాంబ్రహ్మం చెల్లెలివా? తెలిసింది, నీ వెందుకు భయపడ్డావో! మీామునిసబుగురించికదూ? నిజమేనా?

క—అవును.—

బ—అమ్మాయీ! నన్ను మీాతండ్రిగా భావించుకో! ఇంకొక్క విషయం? మీాఅన్నకూ, అతనికీ విరోధం ఉందిట కదూ!

క—ఊ!—

బ—ఎందుకో!— నీనించేనా? అతడు నిన్ను వరించేడుకదూ! ఏవమ్మా పలకవ్!—

క—ఇదంతా, అవసరంలేనిప్రసంగం! [అనుకొనుచు, చీదరింపుతో బోవును].—

రా—[నిర్ఘాంతపోయి] బాబూ! ఎక్కడో ఉడ్డోరురాలులాగుంది!

బ—[యోచనతో] ఆ! గొప్పశీలవతి! ఇలాంటివాళ్ళుండబట్టే, మనహిందూదేశంపేరునిలబడుతోంది, . పద, నడు! ఉ! ఏదీ! ఉండు! [ఆమెబోవుచున్న వైపు చూడ్కునిగిడించి]— ఇలా కాపవీధిలోకి దారున్నట్లుంది రా?—

రా—మరేంబావ్! దయచేయండి!—

[ఇరువ్వురు బోవుచుందురు]—

(కనకమ్మ బోవుచున్న సందునుండి ప్రవేశము—
సంకులుగాడు)

రై—[రామస్వామిని తట్టి, వెనుకకు బిలిచి) ఆరేనా,
మేస్త్రీటుగారు?

రామ—అవును. ఏవీ?–పద–బసలోకి.

సం—(వినుపించుకొనక, విలపింపు మొగముతో ముందున
కరుదెంచి, బహద్దరు, పాదముల కడ్డముగబడి)
పెబూ! దండాలు! రచ్చించాల!

బ—(ఆగి) లే, ఎవర్రానువ్వు? ఏం? ఏం జరిగిందేఁవిటి?

సం—(లేచి నిలుచుండి) చిత్తగించండి, మారాజా! నన్ను
సంకులుగాడంటారండి.

బ—ఆ! తర్వాత?–

సంకు—పెబూ! ఆడుసెప్పడం, ఈడుకొట్టడంనాండి.

బ—ఎవళ్ళ్రావాళ్ళు!–

సం—బాబూ! సెప్పినోడు రాంబ్రెమ్మవండి, కొట్టినోడు,
ఆరైతు పురుగ్గాడండి!

బ—ఆ! ఎందుకూ, ఊరికేకొట్టేడా?

సంకు—నేకుంతే, మారాజా! నామానాన్నేను నాపొలంలో
మన్నిగేసుకుంతుంటే, మొనకాలొచ్చి చాపాటికర్రి
తో చెడమోదేడండి!

బ—ఆతర్వాత, నువ్వు రెండుకొట్టి ఉంటావ్!

సం—చెన్! నేదుమారాజా! కావొలిత్తే దరియాప్తు సేయండి, మునచబయ్యున్నారు!-

బ—ఎప్పుడు? వాడు కొట్టడంచూసేరా, మునసబుగారూ?-

సం—ఎయ్యో! ఆయెనక, వొచ్చేరు!

బ—సరె! ఫిర్యాదు రాయించుకొవచ్చేవా?

సం—సిత్తం (ఒకమూటను, ఒకకాగితమును ఇచ్చును. వానిని రామస్వామి గ్రహించును).

బ—ఆమూ శేవిటా ్రి?

సం—ఏంనేదు బాబూ!

బ—ఆ! ఏదో నజరానా తెచ్చినట్లున్నావ్! ఏఁవున్నాయి, అందులో నువ్వొక్కడో చాలామంచివాడిలాగున్నావ్!

సం—సిత్తం, సిత్తం, ఉడతాబకితండి! పేదవోణ్ణి! ఏదో నాలుగుపళ్ళిచ్చుకొన్నానండి!

బ—(ఆలోచించి) చూడూ, రామస్వామీ! ఈరైతుమనకు నజరానాయిచ్చినట్లు, వీనిపేరు మనదగ్గిర యెల్లప్పుడూ ఉండాలి! బసకు వెళ్ళగానే, ఆసామీన్లకోజాపితా రాయించి, దానిమీద వీని వేలుముద్దరగూడాతీసుకో! ఓయ్, రా, మాతో మాబసకు! [ముందునకు బోవుచుండును].

సం—సిత్తం, మారాజా! తమవొంటిపెబువుని నానెక్కడా సూడ్నేదు; నాయం గ్రోయిత్తారండి!

రామ—[నవ్వు నాపుకొనుచు, కొంచెం వెనుకకుతగ్గి] మా బాగా సెప్పేవోయ్[తిరుగ ముందుకు సాగుచుండును].
సం—[వెంబడినేగుచు, కొంచెంతగ్గి, ఉల్లాసంతో] కోట్లో పాగా యేసేనన్నమాటే, ఇక నేం! [తిరుగ ముందునకు సాగుచుండును].
రా—[తగ్గి] ఓయ్! సంకులూ!
సం—సిత్తం!-
రా—నువ్వొచ్చినయీాదిలో నీకెదురుగా యీార్యూరా లేదూ?
సం—నానంతగా సూడ్లేదుగానీ; ఎవరో ముసుగేసుకొని పోతున్నారు!- అచలది యీాదికాదు నే!
రా—ఆ! మరి?
సం—అదో, మాయిళ్ళకి ఓసిన్న గొంది దారుంది!-
రా—ఎన్నిళ్ళున్నాయ్!-
సం—ఏదీ, మాదొకటూ! ఆయెనక, చాకలిసోవిగాడిదోటి! కడమవోళ్లిళ్ళకి దారేనేదు, కోరడిఅడ్డేత్తుంది!-
రా—సరి, సరి! ఉండు, బసచేరుకున్నాం.
[అనుచు నొకయింటిముందర కేగ, రామస్వామి వడివడిగ నాఇంటిలోని కేగి, వీథితలుపు దీయును. బహద్దరు లోని కేగును. పిదప రామస్వామి జాబితానువ్రాసి సంకులుగానిచే వ్రేలుముద్దర వేయించి, వానినంపి వైచి లోని కేగును].

# విపరీతవ్యక్తి

## తృతీయాంకము.

### ద్వితీయరంగము.

[ప్రదేశము-మేజస్ట్రీటుగారి విడిదిగృహమందలిగది. ఆగది యందొకమంచముపై నెత్తుగ దిండుల తలక్రింద నుంచుకొని బహద్దర్ పండుకొనియుండును. ఆప్రక్క నొకవాలుకుర్చీయు, దానిప్రక్క నొకమేజాపై రికార్డుల పెట్టెయు, సన్నగతగ్గింపబడియున్న లాంతరుయు నుండును. ప్రక్కనుండి మేజస్ట్రీటుగారి తలపట్టుచు, కునుకుచు కురవడుండును].

బ—[శరీరమును విరచుకొనుచు, ఆవలించుచు, లేచి],- అబ్బా! ఏం దోవలాగ్రి?

కు ... [లేచి, నిలుచుండి]- ఏదీబావ్! దోఁవల్లేన్నే.

బ—ఏఁవో! నాకునిద్రమాత్రం బాగాపట్టలేదు. [లేచి, పచారుచేయుచు] సరి, నీవైనాపడుకో, పో! అవసరఁవైతే పిలుస్తానులే.

**కు**—ఒద్దు, బావ్! తఁవరుపడుకోన్నే, నా కెలానిద్దరట్టు
తాది, నానుకునుకుతుండమట్టి తవురికి నిద్దరట్టలేదేఁ
వో; ఈపాలి కునుక్కుండా తలరాత్తాను, తొంగోండి,

బ—[నగుచు] లేదురా, అంచేత కాదురా! ఏవో తలంతా
భారంగాఉందికూడాను. అంచేతగూడా నిద్దర-

**కు**—తక్కువోణ్ణయినా, చెమిత్తానంటే, ఓమనవి సేసుకొంతా!

బ—ఏమది? చెప్పు, ఫర్వాలేదు.

**కు**—రెండుదినాల్గా సూత్తుండానుగందా! తఁవరేదో ఆలో
చిత్తుంటారూ? అందుకే నేవో తలకాయ యేడెక్కి
నిదురట్టకుంది. మాపిటియాళ వొల్లకతొంగుంటేనో
అంటూ, పెబూ!

బ—[సంతోషాతిశయాలతో] ఓరి వెధవా! నువ్వేక్కడో
ఆవలిస్తే పేగుల్లెక్కెట్టేటట్టున్నావురో!

**కు**—తొల్తనే మనవి సేసుకొన్నానుగానా! పెబువోరికి
కోపంవొచ్చినట్టుంది. మోటముండోళ్ళంగందా, చె
మించాల!

బ—అబ్బే, లేదురా! కోపంలేదు. నిజంగ్రహించేవని సంతో
షంగాఉంది. ఒరే! ఏంచేస్తాం, మాబ్రతుకేఅంతరా!
కొంచెం బద్ధకపడి, నిజంగ్రహించలేకపుతే, ఎంత
చికాకనుకొన్నావ్!...

**కు**—సిత్తం, సిత్తం!—

బ—[తిరుగాడుచు, ఆగి]- ఓరే, కురవా! చూడూ! ఆగదిలో చిన్నగోనెసంచీఉంది, తీస్కానిరా!

కు—సిత్తం. [పోవును].

బ—వీడ్నిబాగాపొగిడి మనసబు నడత గ్రహించాలి. దొంగ. అడ్డుప్రశ్నలకి దొరకడు. అయినా, మర్మంలేదు, కొంచెం భయస్థుడు! పాపం! ఈమూఢులంతాఇంతే! ఎలాత్రిప్పితే అలా తిరుగుతారు [పచారుచేయుచు, సణుగుకొను చుండగా, సంచీతీసుకొని కురవడు ప్రవేశించును.]

కు—సిత్తం దేవరా! గ్రయించండి! [పండ్లసంచీనటనుంచును]

బ—ఆకట్టువిప్పి, చూడూ అందులో నేఁవుందో?

కు—[అట్లుఁజేసి అందుండి బత్తాయి నారింజ, ఆపిల్ మొదలగుపండ్లనుఁదీసి బైటనుంచును. బహద్దర్ ఒకపేనాకత్తినిఁదీసి, ఒకపండును గ్రహించి కోయబోవును].

కు—బావ్! నానుండగా, తవరికెందుకాశ్రమ? (కత్తిని గైకొని, ఆపండ్లను తానుగోయుచుండును).

బ—[పచారుచేయుచు, జేబుగడియారమునుదీసి, చెవియొద్దనుంచుకొని], అన్నా! వాచీ ఆగిపోయిందే! ఇపుడెంత రాత్రవుతుందిరా?

కు—[ముందునకొరఁగిజూచి] జాఁవున్నర కావొచ్చునుబావ్!

బ—అయితే, ఇంకా గ్రామంలో సద్దణగలేదేం?

కు—యెన్నెలరాత్రుళ్ళుగా, బావ్!

బ—సరి, సరి, [ముందునకుబోయి చటాలున నిలిచి, యేది యోశబ్దము చెవినిడ సిదానించి, హుంకరించి] మొద్దుగాడిద!

కు—ఎవరిమాట, మారాజా! [తెల్లబోయి చూచును].

బ—[నగుచు] నీవుకాదురా! అవతల. మాపట్నవాసం పశువు, ఎవరోలేపుతున్నా, లేవలేదు. మాకన్న వాళ్ళకే కేంపులో, సుఖం, ఠీవి, దర్జా! హెూదా!

కు—సత్తెంగాని, మారాజా! రాంసోవిబాబు మాత్తర మం చోడండి!

బ—నిజవేకాని, కుంభకర్ణుడు. ఉ! పోని, నువ్వెళ్ళి, ఆవచ్చిన ఆసామీని పిల్చుకొనిరా!

కు—సిత్తం, కానీ, [నసుగుతూ] అయ్యోరుతొంగున్నారని సెప్పి[ పొద్దుపుట్టినా మెనక రమ్మంటేనో?

బ—ఎంతమాట! రాత్రివచ్చేవాళ్ళేదో రహస్యంగా సందే శాలుతెచ్చి ఉంటారు. పొమ్మనకు! తప్పకుండా తీస్కానిరా!

కు—సిత్తం, దేవరవారి సిత్తం! [పోయి, ఒకనూతనుని వెంట బెట్టుకొని వచ్చును].

బ—ఆ! ఎవరునువ్వు? ఇంతరాత్రివేళ యెందుకొచ్చినట్టు?

నూత—నరుడా! శ్రీగురుదేవునాజ్ఞ! ఒక్కసందేశం! నిన్నొక నరుడు మోసపుచ్చాలని చూస్తున్నాడు! ఏమరకుండు ము. శివ! శివ! [అనుచు పోవుచుండును].

బ—[వెంబడించుచు] ఆగాగు! ఏఁవాళ్ళొందర?-

[నూతనుడు వినిపించుకొనక, వెనుదిరిగి,

'సత్యవేజయం!' [నిష్క్రమించును].

[బహద్దరు తెల్లవోయి నిలుచుండును].

కు—[మెల్లమెల్లగఁదరిజేరి] ఏంబావ్! అలానిల్చున్నారూ?

బ—[నిట్టూర్పువుచ్చి] చిత్రంగాఉందే.

కు—సిత్రవేంవుందిబావ్: రాండి, ఈపండుముక్కలు తిం టూండండి; అంతా నాను మనవిచేస్తా.

బ—ఆ; ఆ; వీడెవడూ, అసలు, [పండ్లముక్కలదినుచు, వాలుకుర్చీలో కూర్చుండును].

కు—బాబూ, ఆడో బైరాగండి. సాలాసదువు కున్నోడండి ఈడ్నించేగందా, మనమునచబయ్యా సాకలోడూ కాట్లాడుకొనింది.

బ—అదెంచేత?-

కు—ఏంనేదూ, ఈ బైరాగి పాడతావుంటే, ఇంటూనిల్చున్నా డండి, ఆడూ, ఎవ్వూఁడూ- సాకలోడండి.

బ—ఆ!-

కు—ఆయెనకాడికి దానంకూడా సేసేడండి. ఇపుడూ, ఏంటో యేదాంతం ఇన్డానికి యెల్తుంటాడండి, యీారికాడండి.

బ—అయితే, మునసబుకేం?

కు—కాదా, మరి! అదేచవయంలో ఆడ్నీరుపనిమీాద పిలుత్తే రానేదని, బుగలగోర్రు కొ ప్పడితే, యీాళ్ళశిష్య

డంటాడండీ, 'సదువుకున్నోడికంటే, సాకలోడే మేలంట!'

బ—ఆహా! అదా చిక్కు! సరి!-ఊ! చెప్పు!

కు— ఇంకేం వుంది బావ్?

బ—(ఆలోచించుచు) మరైతే, ఈబైరాగి జ్యోతిష్కుడా?-

కు— అదేఁవోతెల్దుగాని, ఏదో యేదాంతం సెబుతుంటాడండి! ఎప్పుడుసూసినా బగమంతుడిమీదే పలుకు!

బ—ఆ! ఏమైనా, గొట్టం!-

కు—ఎయ్యే, గంజాయి వోసనేనేదండి! అచలు అడుక్కోడంలో కూడా-ఓరైనా ఇత్తేకద్దూ, నేకుంతేనేదు! ఏది సిక్కితే అదే తిని పల్లకుంతాడంతే నమ్మండేం?

బ—అలాఅయితే 'జ్ఞాని' అనొచ్చును! అయినా తెల్లవారుజామునే వెళ్ళి పరీక్షిద్దాం, వొస్తావా?-పిపిబస తెల్సును గదూ!-

కు—ఓ! తెలకేం! మారెళ్ళోరి మావిడితోట్లోనండి! మాలీది కత్తలపక్కంది నండి!-

బ—ఊ! సరిలే! (తేన్చి) ఆవున్నముక్కలు నువ్ తినీరా!

కు— ఒల్లను బావ్!

బ—ఏమిరా, తిండిదగ్గిర మొగమాటమెందుకురా! నాఎదురుగుండా తినడానికి జంకుతున్నావేమో! పోనీ! ఆ ప్రక్కకు తీసుకొవెళ్ళి తినీ!

కు—ఒద్దు బావ్, తఁవరు తినండి!

బ—అదికాదురా! నాకు చాలవేమో అనేనా! మస్తుగా

తిన్నానులే! తిను.–ఉ!

కు—ఉ, ఉ! (తలవంచుకొని, బత్తాయినారింజ పండ్లు
ఒలుచుచుండును).

బ—ఒరే! ఇటుచూడు! ఇంతవిలువైనపళ్లు నీయంతటనీ వెప్పుడూ
కొనుక్కోలేవుగదా! అంచేత కొంచెం రుచిచూడు!

కు—సత్తెవేగాని, బావ్, ఈమాదిరివి నిన్ననే తిన్నానండి!

బ—ఆ! అబద్దాలు, దొంగా! నీకెక్కడివి?

కు—మునచబయ్య గోరిచ్చేరండి! అచలారంపినవే గందా,
ఇయి (వి). నానే తెచ్చేను, సంతనుంచీట్నీ.

బ—ఆ! నీవు తెచ్చేవా సంతనించి!

కు—మరేంబాబయ్యా! ఆ! (నవ్వుచు) ఒకేళ తవురుతెచ్చు
కున్నారేవో! ఈట్నీ ఆరే పంపి, ఉండేమాటుంటే,
నాను తెచ్చినయే!

బ—ఆహా! సరి! అయితే, నువ్వుదెచ్చినవే అయివుండొచ్చు
న్లే, అయితే, (ఆలోచించుచు) మరి మీామునసబు
గారు నిన్నుచూస్తే చాలా అభిమానం పడ్తారన్న
మాట!–

కు—అదేవో, నానినుకుంతానూ, అదీనేదు, ఇదీనేదు!
మారాజా! రెండుసేతులూ కలుస్తేగంద, సప్పుడవు
తుంది! నానుమాత్తరం, ఒవురేవన్నా ఎదురుసెప్పే
దాన్కి మా జంకుతానండి!

బ—అదిమంచిదేలే, కాని, నీమీాద అంతఅభిమానం లేకుంటే,

అంతవిలవైన పండ్లిస్తారా? ఊరికే!

కు—సెబూ!• తఁవరెక్కడో దేవుడ్నాగున్నారండి! (తెల్ల బోయిచూచుచు, మాట్లాడనేరక, ధీర్ఘముగఁ జూచుచు నిలుచుండును).

బ—అదేవిట్రా అది, దెయ్యంపట్టిన వాడిలాగ! ఒరే, కుర వా! నిన్నే! ఏఁవలా తెల్లబోతున్నావ్!-

కు—దేవరా! అచలాసమాచారం, మాకోడల్తోటేనా, సెప్పనేదంటే నమ్మండేం?-

బ—ఏఁవమాచారంరా! సెప్పు, బెదరకుండా!

కు—నేదుబావ్! బెదురెందుకూ! అమ్మయ్యా! [నిట్టూర్పు పుచ్చి, బహద్దర్ పాదములకు మ్రొక్కి, [నిలుచుండి] తవరిట్టే గ్రెయించేసేరండి, ఆరు నాకాపళ్ళ్యారికి నే ఇయ్యనేదని!

బ—ఆ! అంతేనా! చెప్పు! మరి నువ్వాడిగేవేంటి, ఖరీదుకు ఇమ్మని!

కు—ఎయ్యో, అదీనేదండి! తవరికాడ దాపరికఁవెందుకూ! పోనమద్దేన్నం తవరిసేవసేసుకొని, చంతకెళ్లేనుబావ్ ఆపళ్ళు తేడానికి! అచలాటి ఎంపికమాకేం తెలుత్తాది, బావ్! అందునోవి, మూడుపళ్ళు, ఏదోనాసెడ్డాయి, బావ్! ఆట్ని తిరిగీ, ఇచ్చేసి రమ్మన్నారు.

బ—ఆ!

కు—బావ్, సెప్పకేం; బద్దకపడ్డానండి! ఆటిఖరీదు నానిచ్చు

కొండావని!-

బ—పోనీ, ఆమాట చెప్పలేక పోయావా, మీమాన సబులో

కు—ఎందిబాబ్! ఏంనాబం? ఆరుకోపం తెచ్చుకొని, కూక

బ—(ఆగి, ఆలోచించి) పోనీ, నువ్వొచ్చుకుంటానంటే, అలాగే అన్నారా?

కు—అబ్బో! అలాసెప్పినా, అదో తంటాగాదా? "ఆ! యెదవా! నీతలేంటి, నువ్వొతినేదేంటి! గాడిదా! సచ్చి నట్టిల్లి, మారిసితే" అనా?

బ—మరాసామ్ముకి ఏం చెప్పేవ్!

కు—అచలార్ని కల్చుకోడవేనేదూ నానూ! మాపెద్దోడిసేత మాత్తరం సెప్పించేసేను, "మరి సంతలో మాంచిరకం దొరకనేదూ! మాబాబా పళ్ళిచ్చేసి, ఆరణాలూ తెచ్చేసేదూ"అని.

బ—మరీ దినవైనా సొమ్మిచ్చేసేవా?-

కు—నామొకం, నానిచ్చేదేంటి? చెనకాయలున్నాయి గందా! ఆటిమీద తీర్చుకోవాలి!

బ—పోనీ! అందాకా అయినా ఆగి ఉంటాడుగా!

కు—ఊ! కొంచెం, కొంచెం చిలుకులుండిమోతే, అదో, అంద పంటయేళమాత్తరం, కట్టిపుచ్చుకుంతారు!

బ—[విచారం సూచించుచు] పాపం! నీవు తెచ్చిపెట్టుకున్న దేనా? పోనీ నేనిస్తాన్లే, నువుచేసేపనికి, ఇనాంవివ్వాలి

కదా!

కు—ఏంటో, దర్మప్పెబువులుకామట్టి అలాచెలవిచ్చేరు, బావ్! సరకారు నౌకర్లంగండా, పెబువులసేవ సెయ్యాక తీరుతుందా? మాం, మాతల్లోపేనూ సెయ్యాల!

బ—ఒరే, నీకు తెలీదుగానీ, సర్కారుజీతం మాస్వంతపని చేయడానిక్కాదురా?-

కు—పోనీండి! గొప్పోరూ, పెద్దోరూ! తవరిసేవసేత్తే పున్నెం వుంటుంది నండి!-

బ—ఈబేరా లెందుకులే! నేనుమాత్రం నాచేతిగంటేం ఇచ్చేదిలేదులే! మాకిచ్చే బత్తాలోది మిగిల్చినీకిస్తా నన్నాను! అది తర్వాత చూసుకుందాంలే!- చూడూ! నాకు మరింక చోరకుండాఉన్నాయి! ఆకోసినమట్టు కైనా, ఆముక్కల్ని అవతలకి తీసుకువెళ్లి, మాజవా న్ని లేపి, మీరిద్దరూ తినేయండి! ఉ! వెళ్ళు!-

కు—సిత్తం, తవరిచెలవ్! [పండ్లముక్కలను దీసుకొని బోవును)-

బ—( నీళ్ళతోచేయి కడుగుకొని, గ్లాసును కుర్చీదండె పై నునిచి, చేయితుడుచుకొనుచు] పాపం! చాలా భయస్థుడు! ఇలాంటి వాళ్లెందరున్నారో!- [కుర్చీలో కూర్చుని] ఆ! బోధపడింది. వీళ్లిద్దర్నీ అమాయగాడే ప్రేరేపించిఉంటాడు. ఆ! అన్నట్టుగ! అప్పుడువచ్చిన

వృత్తరం ఎక్కడ పెట్టేనుచెప్మా! [సందుగబెట్టె యందలి యరలవెదకి, దొరకనందున, ఆలోచించి, లేచి, కోటుజేబులవెదకి, యందుండి కొన్నిపత్రము లనుదీసి, మనస్సునందు జదువుకొనుచు) అబ్బా! బహిరంగంగా మామెమ్మోళ్ళుకూడా తీసుకొంటు న్నారూ!- [నిట్టూర్పువుచ్చి] ఇలాంటివాళ్లుండబట్టే, ఫిర్యాదులు ప్రబలుతున్నాయి! పాపం! ఈకర్షకులు మంచిపంటల సమయంలో కోర్టులంట తిరగడంవా! రామ! రామ!ఎంత దారుణం!

పళ్లుతాను తెప్పించి, యీరైతుచేత నాకునజరానా పంపించడవా? సరి! ఈ అలవాట్లు మాన్పించాలి! [చటాలున లేవబోగా, కుర్చీదండెపై నుంచినగ్లాసు నేలపైబడును.-ఆశబ్దమునకు రామస్వామి, కురవడు, ఇరువురూ ప్రవేశింతురు].—

బ.—[వారల రాకనుగ్రహించి] ఏవీలేదర్రా, గ్లాసు నేల మీద పడింది.

రా—చిత్తం!

కు—సిత్తం, సిత్తం! ఇప్పుడైనా తొంగోండి మారాజా, సేనారేతిరి పడింది.

బ—అవున్రా! కొంచెం కళ్లుగూడా బరువెక్కుతున్నాయ్! [అనుచు, చేతిలోని కాగితముల పెట్టెలోని యరలో

భద్రపఱచి, పెట్టెబీగము వైచును. రామస్వామి ఆ పెట్టెనొకచోట భద్రపరచును. కురవడు కుర్చీనొక మూల నమర్చును. బహద్దరు మంచమును సమీపించును.]

కు—తొంగోండి మారాజా! ఈపాలి బాగా తలరాత్తాను.–

[బహద్దరు పండుకొనగ, రామస్వామి విసరుచుండును, కురవడు తలకు ఆముదమునురాసి, తలపట్టుచుండును].

బ—[కండ్లుమూసుకొనియే] ఒరే! కురవా! ఈ గ్రామస్థులు నీకు జీతాలిస్తారా, కూలిడబ్బులేనా?–

కు—జీతాలకే గింజలు కొలుత్తారు పెబూ! ఏంజీతాలు మారాజా! అదిసాలకేగందా, కొలుకి కాస్తపొలం పైరుసేసేది!

బ—అలాగా[ ఈమారేం నాటేవ్!

కు—ఈపాలి మెట్టుతీస్కొని, శెనక్కాయలేసేను పెబూ!

రా—అంచనామీద ఎంతపంట రావొచ్చును!

కు—ఏంపండుతాది! పదిపుట్లు రావొచ్చును. అయితే సావుకారికిపొయిదా[వొడ్డీ] మూడు, నాలుగు పుట్లుపోదా?

బ—అదేం? [కండ్లువిచ్చి, ఆశ్చర్యంతో కురవని జూచును].

కు—మరారికాడ, మదుపుల్కి కూలుల్కి రెండుకుంచాలకి వోడుకున్నాను గానా?–

బ—[చటాలున, ప్రక్కకొరగి] ఏవిటి? రూపాయికి రెండు కుంచాల- శెనక్కాయలు వడ్డీయా?

క—[భయముతో నిల్చుండి] సిత్తం దేవరా!

బ—శెట్టి అంత ఆశబోతా?

క—తవరికంతా తెల్సుంటుంది! మరాడు మునచబయ్యేకి మా మొల్లియ్యాలంటాడు, మారాజా!

బ—పోనీ, రామబ్రహ్మందగ్గర వాడుకోరాదూ, ఆసామ్మి-ధనవంతుడేవోగదా! [అనుచు తిరుగ చాగోరును].

క—[తిరుగ తలబట్టుచు] నిజవేకాని మారాజా! గేమం, గేమం అందరికి ఇత్తాడా ఆమారాజు! కాగా, అల్లిద్దరికి పడదుగందా! ఇప్పుట్లో ఆరికాడికెల్తే మమ్మల్ని నిల నిత్తాడూ, యీబుగతగోరు! ఏదో బావ్, చాలా కాలం నుంచీ వోడికైపోయిందా, మరి! అలా చిలుకలుండి పోతుంటాయా! మళ్లా, కాతా మార్చా లంటే, [ఆగి]-- ఇంటుండారా? [తొంగిచూచును. బహద్దరు కండ్లుమూసియుండుట గమనించి] ఎయ్యో! అయ్యోరు నిద్దరోతుండారు [మెల్లన గనుకొనుచు, నాలుక కఱచుకొనును].

[రామస్వామి, మాట్లాడవలదని సంజ్ఞచేయును. రెండునిముసము లిరువురు అభినయ రూపముగా మాట్లాడుకొని, చల్లగ, వానినివీడి, అడుగులు చప్పుడుకాకుండ బెటకేగుదురు].

---

# విపరీతవ్యక్తి.

## తృతీయాంకము.

### తృతీయరంగము.

(ప్రదేశము:—మేజస్ట్రీటుగారి బస.)

ప్రవేశము-కురవడు.

(కురవడు అరుగు చివరభాగమున నొక ప్రక్కగోడకు చేరబడి, గొంతుకకూర్చుండి, చుట్టనడ్డపొగవైచుకొని, పదే పదే గుమ్మమువంకను, ఒక్కొక్కపరి వీధివంకనుఁ జూచుచునుండును.— ఆదారి నిరువురు ముగ్గురు బోవుచు, వానితో కుశలప్రశ్నల ముచ్చటించి బోవుదురు.)

(ప్రవేశము,—చాకలి సోమిగాడు).

సో—(తనదారిని దానుబోవుచు, మేజస్ట్రీటుగారి యింటి దిక్కొకపరి నిదానముగవీక్షించి, యొంటరిగనున్న కురవనిగాంచి, మెల్లమెల్లన నడుగులిడుచు, వానిని జేరుకొని, కనుసంజ్ఞచే మేజస్ట్రీటువారేమి చేయుచుండిరని ప్రశ్నించును).

కు—(తలనూపుచు) నేరునే, పెరటినో కెల్లేరు; ఉన్నా, నీ కేంబయుం?

సో—కాదునే, మా మాంచి పెబువురా! నేకుంతే, ఆనాడలా నానెట్టినల్లరకి మరోడైతే యీపాలి బొక్కలో తోసేసును.

కు—నువ్వింకా ఏం[గెయించేవురా! నీవుతాగి అల్లర సేత్తుంటే సూడాలని నిన్ను పిలమంటే!

సో—ఆ! నిబ్బగ!

కు—అమ్మతోడు! ఒట్టు! సచ్చినట్టు!

సో—ఓరు, నువ్వా, నానా?

కు—నువ్వు తాగుండావని నాను సెప్పకుంతే, అయాళా!- ఎవురో తెలిసొచ్చును!

సో—ఆ! నువ్వు సెప్పమట్టే బతికేనా: నేకుంతే,-

కు—[కొంచెము, మీదకు లేచి]- మరిసూత్తా, మజా! ఇయ్యాల, ఇచారణలో;-

సో—[అడ్డువచ్చి] ఓరి, ఊరుకోరా! నీవున్నమాయిరి! అంతటోడివే నువ్వు!......... కానీ, మావా! నీ మీదేవంతగురి కుదిరిందీ, ఆబాబుకి?-

కు—నీనాగ నానాట్టే తాగనుగామట్టి.

సో—ఒస్, ఊరుకోరా; ఏందెప్పతున్నావ్; పోన్లెస్సే సెప్పకుంతే, దాచుకోరా, మాబాగ్గం; [అని పో బోవుచు, ఆగి] సెప్పవ్,

కు——ఏఁవుందోన్! ఆబాబుచేవ బాగాచేత్తానుగామట్టి.

సో——[ముందున కరుదెంచుచు] ఆ! ఇంకావుంది, కిటుకునువ్ సెప్పకుండున్నావుగాని!

కు——[మెల్లగా] ఊరోకోరా! ఏంనేదూ! ఆబాబడిగే దానికల్లా వోస్తవం మనివిసేత్తుండానుగానా! అంసేత.

సో——[మరీ చేరువకరుదెంచి] మరానాగైతే, నావూసేం వొచ్చిందిరా? నాను నౌకరీకి రానేదనీ, కోపంసేత్తుండాడు గాఁవోసు!

కు——నేదోన్స్! ఆబాబుమనచు నీకేంతెల్సా, అంటా! ఆడ్రా నేదూ, ఈమ్మాన్నేదూ, అనేగోలే నేవోన్స్;

సో——ఆ; —

కు——అయితే, దాచుబుగతని మాత్తరం మాబాగా పసిగట్టేడాయ్; సూడూ, ఆమందే, ఓడూ!

సో——ఆ, మునచబయ్యోనా?

కు——మరేం! ఆబుగతుందే, ఆడికీ, యీాడికి, కయ్యెవెట్టి, అటో, ఇటో కాసి, సేత్తుండే కిటుకుందే, సిటికెలో కనిపెట్టేసినాడ్రా!

సో——అయితే మాంబతికే వన్నమాటే! మరీ:- [ఆగి, కను సంజ్ఞచే బహద్దరురాకను సూచించుచు). నాకేళ యింది. పోతాన్రా! (అనుచు పోవుచుండును.)

(ప్రవేశం—బేర్‌డ్రెస్సులో బహద్దర్)

బ——(ప్రవేశించుచు) ఆపోతున్నవా డెవడ్రా? పిలువ్!

కు—(కంగారుతో, లేచి, చుట్టనుఆర్పి తలలోదోపుకొని) చాకలిసోవిగాడు, బావ్! [ప్రక్కకుదిరిగి] ఓరి, సోవిగా!

సో—[భయముతో, వెనుకకు మరలి]బాబూ, దండాలెడ్తాను దాసుణ్ణి!

బ—[అందుకొని] ఏం, ఏఁవొచ్చేవ్! పోతున్నావేం? ఏం మాట్లాడు కొంటున్నారు?–

[సోమిగాడు కంపించి, మాట్లాడ నేరక బెదురుతూ నిల్చుండును].

కు—బయం నేదు, సెప్పరా! పెబూ! ఏంనేదూ! ఆమొదవ తఁవరికొలువునోకి రానేకపోనాడు గందాని సాదక బాదకాలు సెప్పాగుంతున్నాడండి!

బ—ఏం? ఎంచేత రాలేకపోయేడూ?

కు—మరాడో ముద్దాయిగంద! ఏవరేఁవనుకొంతారో అని జడిసేడండి!–

బ—అబ్బ! అంతదూరవాలోచించేడూ! సరి! రాకపోతేనేం! ఆ! [నిదానించి] ఓహో! చాలాప్రొద్దవుతోందే, కురవా! మీరిద్దరూకలిసి సభఅలంకరించేయండా! ఇక్కడేచాలు! రామస్వామి వెళ్ళేడుకదా, చాలు! వాళ్ళనిపిల్చుకొని వచ్చేస్తాడు! [లోనకేగును].

సో—[అరుగు నెక్కుచు, నిట్టూర్పువుచ్చి] ఏంసేత్తాడోఅని, మాజడిసేన్రా కురవా! [సంతోషము బట్టఁజాలక,

ఉన్మత్తుఁడై పాడును]-

పాట!—[సావేరీరాగం].

[భరతనాట్యమండలి దరువు]

"అదుగో! చందురుడు! ఉదయంబాయెను" వరుసను.

బలేమాంచీ పెబువ్రూ-బాద్దారు! బాబోరన్నా!

కురవన్నా!-బలే!

[దురితం] బలేమాంచీ పెబువ్రూ - బలేమాంచీ

పెబువ్రూ-ఓరన్నా!-

కు—[అడ్డువచ్చి] నీకేం మతోతోందేంటోరి, ఇది, సాకిరేవు గాదురా!-

సో—[తెలివి దెచ్చుకొని]-ఆజోరులోఅలాజారి పోయిందిరో!

[నాలుక కఱచుకొని, తెల్లబోయి, నిలుచుండును].

కు—ఇంకాసూత్తావేం! ఆబాబు సెప్పిన్దేట్టి నువ్వు సేత్తుం దేంటి! రా! ఆకొసకాయ్! [కుర్చీని చేరుకొనును].

[ఇరువురు మానముతో సభనలంకరింతురు].

బ—(లోపలనుండియే) ఎవరైనా వచ్చేరా!

కు—(ముందునకుఁజూచి) సిత్తంపెబో! రాంబ్రెమ్మంగోరూ, పురుగ్గాడూనండి!

ల—సరే, కూర్చోమను.—

సో—(తానునుఁజూచి)- ఇల్లుగలయ్యోరుకూడా వున్నారు గందా, కురవా!

కు—ఉండొస్స! ఈ ఇచారణతో ఆరికి ప్రెమేయం నేదొస్స!

బ—ఎవరైతేనేం? వచ్చినావాళ్ళని పొమ్మనకు! —

కు—ఆ! నేదుబావ్!—(రెండడుగులు ముంటునకరుదెంచి, యీ ప్రక్కింటి వీధిచావడిలో నున్నవారల నందరితో) రాండి, మారాజా, పెబువువోరి చెలవైంది! కూకోండి.

రా—మంచిది (అనుచు బ్రవేశించుచు, చాపపై నొక ప్రక్కను కూర్చుండును. ఇంటి యజమానికూడ యరుదెంచి వేరొక ప్రక్కకూర్చుండును. పురుగ్గాడు రామ బ్రహ్మమునకు వెనుక ప్రక్క, చేతికర్రను గెడ్డముక్రింద నుంచుకొని, దానియూతపై, నిలుచుండును. కురవడు, సోమిగాడు కుర్చీకి వెనుకప్రక్క చేతుల, జోడించుకొని, నిలుచుందురు. క్రమక్రమముగ నిరువురు ముగ్గురు, అరుదెంతురు. సంజ్ఞారూపమునవారల కురవడు ఆహ్వానింప వారలుగూడవచ్చి దూరముగా కూర్చుందురు.]

బ—(కోటుతొడుగుకొనుచు నరుదెంచును. కూర్చున్నవారలందరులేచి నిలుచుందురు. సభవారందరు వారికి నమస్కరింతురు.)

బ—ఆ! (అందుకొని, కుర్చీపైగూర్చొనుచు) కూర్చోండి, (సందుగలోని కాగితములను కొన్నిటిని పరిశీలించి, ముందునకుఁజూచి) ఎంచేతచెప్మా కబురంపినాగూడా మునసబుగారు రాలేదూ! పిలవడానికి వెళ్లిన రామస్వామి కూడా రాలేదూ!—

కు — ప్రెబువువా రిసయం గ్రెయించేరని తెల్చిందేఁవో!—

బ—(నవ్వబోయి, ఆగి) నేనేం గ్రహించేన్రా!—

కు—ఏవో, తెలకకూసేనేను. పిలవాని చెలవా?

బ—అక్కర్లేదులే!- (తిరుగ, ఏదో ఒక కాగితంనుదీయుచు) రాంబ్రెహ్మం, నేను చాటుగా కొన్ని విషయాలు పరిశోధించేను. నీనుంచి కొన్నివినాలి: కొంచెవైనా దాచకుండా చెప్పాలి:

రా—[లేచి, నిలుచుండి]- నాకు తెల్సిందంతా పూసగ్రుచ్చినట్లు చెప్తాను, తమరునమ్మండి, నమ్మకపొండి!

బ—సరి, దాసుపంతులుకి నీమీాదంత కోపంకల్గడానికి కారణఁవేవిటీ?-

రా—నాకు తెల్సినంతమట్టుకు ఒక్కటేకారణ మగుపడుతోంది. చిత్తగించండి. వెనక, ఒకమాటాతడు, వర్ణబేధాల్ని ఆధారంగా, జేసుకొని, మాజాతివాళ్ళకి బ్రాహ్మర్లు అధిపతులనీ, సర్వదా, మేం వాళ్ళచెప్పు చేతుల్లోనేతిరగాలనీ, ప్రసంగవశాన్ని, అన్నాడు. ఆవాదాన్ని నేను సమ్మతించక, ప్రతివాదంచేసేను! ఆనా డతడు వాదంలో వీగిపోయేడు, అప్పుడు చేరుకున్న గ్రామస్థులంతా నేను చెప్పినదాన్ని ఆమోదించడంచేత! ఆకారణాన్ని వారికి కోపంవచ్చి వుంటుందని నేననుకుంటున్నాను.

బ—ఇంతబలవద్విరోధానికితగినంతకారణంగాకనపడ్లేదుఇది.—

కన—(గోడప్రక్కనుండి) సత్యం, మహాప్రభో! అతడు పర స్త్రీ మానాపహారాభిలాషి, కుటిలుడు, శిష్టార్హుడు, మీాకు తెలీకపోలేదు!

బ—(నిర్ఘాంతపోయి)-ఎవరది? ఎచట?

రా—(ప్రక్కకుఁజూచి)-నా చెల్లెలు కనకమ్మగాబోలు!

బ—కనకమ్మ? ఎదుటకు రావచ్చును.

క—(ప్రవేశించి) మహాభాగ్యం. న్యాయాధిపతులకి వందనములు.

సత్తి—(కనకమ్మతో ప్రవేశించి) బాబూ! దండాలు! [ఆపె ప్రక్కనే నిలుచుండును.]

బ—[కనకమ్మనుద్దేశించి] అమ్మాయీ! ఆవిషయం ఇపుడు ఋజువు చేయడానికే యీాసభ! అయినా, స్త్రీవి కాబట్టి హెచ్చరిస్తున్నానూ, సభమర్యాదను కాపాడుతూ, ఉద్రేకంవిడిచి, అడిగిన ప్రశ్నలకి సరియైన జబాబులు చెప్పాలి!

కన—తమ శెలవు. కాని,-

క-శె—[కొంచెందూరంలోనుండి వణుకు గాత్రంతో] పెబువువారిచెలవు పెకార్రం హాజరు, మాాప్పెబో!

బ—[ప్రక్కకుతిరిగి] ఎవరదీ? కర్రిశెట్టా?

కు—[తొంగిఁజూచి] సిత్తం, మాారాజా!

క. శె. చిత్తం, చిత్తం, నేనేనండి [అనుచు రెండడుగులు మెల్లగ ముందునకు వైచును].

బ—ఆ! రావొచ్చు! ఇంతాలస్యవేం?

క-శె—[సమ్ముఖమున కరుదెంచి, నమస్కరించి, నిలుచుండి] దండాలుబాబూ! రాంసోవిబాబు సెప్పమట్టింవొచ్చేనండి!

బ—లేకుంటే హాజరు కాదలచుకో లేదా?

క-శె—[బహద్దరు పాదములపైబడి] మా ప్రెబో! చెమించాల [రామబ్రహ్మమును, చాకలినిఁజూపుచు] ఆళ్ళిద్దరూ నా కేం సెడువు సేయ నేదు మారాజా! నన్నిపిర్యాదు సేయమన్నోడే నేకున్నాక, నా కెందుకీగొడవ. నన్ను మన్నించండి! నేరక, గడ్డితిని దిగేనుబాబూ! దిగక తప్పిందికాదు, మారాజా! ఆడికిజడిసి, మాగొప్ప తప్పు సేసేనండి!

బ—[ఆశ్చర్యముతో] ఆ! ఏవన్నావ్? నిన్ను మీామునసబేనా అలా ప్రేరేపణ చేసిందీ?

క-శె—సితం

బ—ఆ 'లేకపోయి' న్దెవరూ?

క-శె—ఆడేనండి.

బ—ఆ! [లేవబోయి] ఏమైనాడు?

క-శె—ఇంకేంవుంది బాబో, సెర్లోపడి సచ్చేడండో! [రోదన చేయును. అందరూ నిర్ఘాంతపోయి, కంగారు పడుదురు.]

బ—ఆ, ఆ! ఎప్పుడు? నువుచూాసేవా?

క-శె—నానెంత సెప్పినా ఇనక, ఓపావుగంటైతుందండి,

అటు కాసెల్లేదు, పడి, సావడానికే!

బ—వెర్రిమొఖవా? ఇంతసేపేం చేస్తున్నావ్! మారామ స్వామి నీదగ్గర కెప్పుడు వచ్చేడూ?

క-శే—ఆడ్నెత్తుకుంటూ, ఆడలా మెల్లిన వెంటనేవొచ్చేడండి!

బ—ఆ!

క-శే—ఆబాబుతోకూడా, అమాటసెబ్తే, నన్నిలాపంపించి, తానలావెళ్ళేడండి, సెరువుకాసి!

బ—సరె! అయితే ఫర్వాలేదు.

(దూరాన్ని కోలాహలం! దాసుపంతుల్ని పట్టుకొని రామస్వామీ, సంకులుగాడూ, బలవంతంగా దీసుకొని వచ్చుచుందురు. చుట్టూనా గ్రామస్థులు కొందరు చేరి నడచుచుందురు).

(ఇదిగాంచి సభవారందరూ వీధిలోని కరుదెంతురు.)

దా. పం. (పెనగులాడుచు) వదులూ! ఉ! వెధవా! నువ్వు కూడా యీమందలో చేరేవట్రా! హు! (హుంకరించును).

బ—కురవా! చూడూ! దాసుపంతులు లాగుంది.

వు—ఆ! ఆరె; నానెల్తున్నానుండండి, మారాజా! ఆళ్ళకి లొంగకుండుండాడు; (పరుగెత్తును, బహద్దరు యథాస్థానమునకేగ, తక్కినవారలు, మెల్లమెల్లన వారివారి స్థలములకుబోయి నిలుచుందురు)

(వురుగ్గాడుబోయి, దాసుపంతులు నడుమునకు కట్ట

బడియున్న బట్టను తనచేతికఱ్ఱకు నడుమను దగిలించి, పెత్తవైచి, దానితో ముందునకు వెనుదిరిగి నడచుచు వచ్చును. మధ్యమున్న దాసుపంతులును ముందునకు నెట్టుచు రామస్వామియు, సంకులుగాడును యరుదెంతురు. వారు సభదరి కరుదెంచిన పిదప, కురవడు వెనువెంట నరుదెంచిన ప్రజను ప్రక్కకు బంపివైచును. వారలును ప్రక్క ప్రక్కగ నిలిచి, పొంచుండి జూచుచునుందురు) (వీరితోడ నరుదెంచిన బాలబైరాగియు, వానిశిష్యులు మాత్రము కొంచెము ముందున కరుదెంచి కూర్చుందురు.)

బ—(తన యెదుట నిలబెట్టబడియున్న దాసుపంతులును జూచి) పంతులూ, బలవన్మరణం పురమత్వంవా? చచ్చి ఎవర్ని సాధించాలను కున్నావ్?

దా—ఆ! నన్నిలా బలవంతంగా యీడ్చుకొని రావడానికి యీబంటోత్రుకేం హక్కుంది?

బ—అది నాయాజ్ఞ!

దా—ఆజ్ఞా పత్రం వేదీ?

బ—అదినీకు చూపవల్సినంత అవుసరంలేదు, పత్రవెందుకూ, ప్రాణహత్య చేయదల్చుకున్న వాళ్ళని బంధించి తీసుకొని రావడానికి! అలాచెయ్యడానికి, వానికి పూర్తిగా హక్కుంది!

దా-పం—ఆ! నా అంతట నేను చావకుండా! హక్కు! ఉః!

సరి! ఇపుడు నాతో మీాకేంపని.

బ—పిచ్చివాడా! ఈ ఉన్మత్తత మున్ముందుంటే!-

దా—ఉన్మత్తత! [పండ్లుకొఱుకును] అవును. అయితే,

కు—[దాసుపంతులుతో] మారాజా! మెల్లిగా మాట్లాడి, తప్పు చెమించమంటే, ఆబాబు రచ్చిత్తాడా, నేక, తిరగబడితే- ఆయెనక ఆరికి కోపఁవొత్తే!-

దా-పం—ఓరి, పింజారివెధవా! నీనించేన్రా నాకీగతి పట్టింది, వెధవా! నారాజ్యానికి విభీషణుడి వయేవురా!

పు—(చటాలునలేచి) అయితే, పంతులుగారూ, తెలకడుగు తానుగందా! (ముందున కరుదెంచుచు, బహద్దరును గాంచి, భయపడి వెనుకకుతగ్గును).

బ—(నవ్వుచు) కానీండి, మీాసల్లాపాలు, ఫర్వాలేదులే! (ఒక తెల్లకాగితమునుదీసి, యేమియో వ్రాయుచుండును).

పు—(కొంచెంనసిగి, తెగువుఁజేసి) మరిగంతే. ఆడు యిబీ సనుడైతే, బుగతగోరూ, నువ్వు రావణాసురుడేంటి? [దానుపంతులు హుంకరించును].

సో—[ముందున కరుదెంచి] ఆనారావుడాడ్నే సంపేసేడు గానీ, ఈరావుడు నువు సావకుండా సేసేడు; ఇంకా రచ్చిత్తాడు నువ్వు ఒక్కడిస్తే!

దా—[గుడ్లుఱుముతు] ఇది కోర్టట;—

బ—[తలయెత్తి వ్రాతనిలిపి, నవ్వి] పిచ్చి! [తిరుగ వ్రాసు

కొనుచుండును].

క—[దాసువీంతుల్ని ఉద్దేశించి] ఆ! నిజంగా, ఇలాంటిదే కోర్టు! జాతిమత భేదాల్లేకుండా, పౌరులకి స్వేచ్ఛ యిచ్చి, వారి వారి మొఱల్ని పూర్తిగా ఆలకించినదే కోర్టు! అంతేగాని, గ్రామాధికార్లూ, న్యాయవాదులూ యేర్చికూర్చిన న్యాయాన్యాయాల దండనే గ్రహించేది కోర్టుకాదు!- తెల్సిందా, పంతులుగారూ?—

బ—కనకం! మొట్టమొదట ప్రభువువారిచ్చిన హెచ్చరిక మరిచిపోయి నట్లున్నావ్!—

క—అన్నయ్యా! వారిచ్చిన హెచ్చరిక యీసందర్భానికి కాదు! వారునాకు వేసేప్రశ్నల విషయం.

బ—[వ్రాతముగించి, వ్రాసినకాగితము నొకకవరు యందుంచి దానిపై నేదియో నొక చిరునామాను వ్రాసియుంచి తల పైకెత్తి చూచును].

క—[బహద్దరు నుద్దేశించి] మహాప్రభో! ఇది, తమరు శెల విచ్చినట్లు ఉన్మత్తతగాదు, నటన. శిక్షార్హుడని గ్రహించి, చేస్తున్న కపటం!

బ—నిజం?-

క—సత్యం ప్రభో!-

బ—ఆలా అని ఋజువు చేయగలవా?

క—చిత్తం. తప్పక చేయగలను. అయ్యా! చిత్తభ్రమ కలడానికి ఎంతకాలం కావాలో ఆలోచించండి!

ఈ ఉదయం 7—30,—8 గంటల వరకూ, తెలివిగా మసలిన మనిషికి, ఇంతలోనే చిత్త్రభ్రమ ఏలాకల్గుతుందో తమరే చిత్తగించండి! ఇప్పుడున్న చిత్తభ్రమ ఈ ఉదయమే- రహస్యాలోచన చేసినపుడుగాని, అసలు ఫిర్యాదులో ఓమాదిరిగా వ్రాసి, వాఙ్మూలంలో మరోవిధంగా చెప్పిన శెట్టిని పడతిట్టినపుడుగాని,- ప్రభువువారికి కానుకగా యిచ్చిన సామాన్లజాబితా మీద వ్రేలుముద్దర వేసినందుకు యీరైతును కసరినప్పుడుగాని- లేకపోయిందా?- ప్రభూ!-

బ—ఇదంతా జరిగినట్లు నీకెలా తెలిసింది?-

క—చెప్పరా, పురుగ్గా! నీవు చూసిన్దంతా!

పు—మారాజా! ఆరిరైతునుగామట్టి, నానుసెప్పితే నిబద్దంటారో, నేదో? శెట్టుండాడు, అదుగో, ఆరిరైతే ఉండాడు! ఇంతయాక, ఆల్లుమాత్త్రరం బద్ద వాడ్తారా?

సంకు—[బహాద్దరునకు సాష్టాంగాపడి. నేదు, మారాజా! ఆరుసెప్పిన్దంతా సత్తెం వే! ఏదో మాయలోపడి సేసేసింది, సేసేం! రాంసోవిబాబు సెప్పిన్దంతా నిజమైంది. సెబుపులూ, తంవరే రచ్చించాల! అయితే,

బ—ఒరే, నువ్వాగు! [అక్కడ చేరిన వాళ్ళనందర నుద్దేశించి] పౌరులారా! ఒక్కమాట! నేను మకాంచేసిన మూడురోజుల్లోనూ, మీముసబుగారి నడతనుగూర్చి ఓమాదిరి అభిప్రాయం నాకు కల్గింది! ఈసమాచారా

లవల్ల, మీకూ చాలాభాగం బోధపడివుంటుంది! ఇదే సందర్భంలో ఇంకోసాక్ష్యంవుంది [కోటుజేబులోని లేఖలను దీసి] ఇందులో ఒక ఫిర్యాదువుంది. [అనుచు ఒక చీటినిఁదీసి] ఇది మీపంతులుగారు రాసినపద్దు! దీనిని పంపినవ్యక్తి స్వయంగా వచ్చివుంటే బాగుండి పోనూ! పేరు అవధాన్లంట!

బా-బై—(లేచి) ప్రభువువారు చిత్తగించేమాటుంటే, ఆవిష యాలన్నీ నేను ఋజువు చేయగల్ను!-

బ—అదెలా!-

బా-బై—మహాప్రభూ! ఆవ్యక్తి, 'నేనే'- ఆపోష్టు జవాను కూడా నేనే!-

బ—ఆ!-

దా-పం—[చటాలున బెదరి, కోరచూపులతో బాలబైరాగి ని,జూచి, వేడినిట్టూర్పుల బుచ్చును]-

బా-బై—దేవా! నేను చేసినపద్ధతి క్రొత్తదే!-

బ—ఎందుకలా చేసేవ్!-

బా-బై—చిత్తగించండి. ఈతను పేరాశచేత చేసిన ద్రోహం సివిలు సంబంధమైన నేరం! నేనీతనిమీద వ్యాజ్యంవేసి, సొమ్మువసూలుచేసుకొందావని తలపెట్టలేదు!-ఈతని నడత తమకు తెలిస్తే చాలునని అలాచేసేను.

బ—అయితే స్వయంగా ఫిర్యాదుచేయలేదేం?-

బా-బై—మహాప్రభో! తమరుకొత్త! మాకింత చనువు

దొరుకుతుందని ముందు తెలీదు; ఇంతచనువే లేకపోతే క్రమప్రకారంగా ఫిర్యాదుచేసి, సాక్షివర్గరాలు సమకూర్చడం మాచేతకాదు!-

బ—సరి, సరి; బోధపడింది. పంతులుగారూ; ఇప్పుడు జరిగినదంతా విన్నారుకదా! వీరంతా మీమీద అనేక నేరాలు రుజువుచేసేరు; నీవుకూడా వీళ్ళలాగే నిజం చెప్పేసేవంటే, మిక్కిలి స్వల్పంగా తేలిపోతుంది, తక్కువ శిక్షతో;-

రా—మహాప్రభో; ఒక్కమనవి; సంగతులన్నీ విశదమయేయి; ఇంతటితో నతను తనకూర్ర కార్యాలను విడుచుకొనడానికి ప్రయత్నిస్తారని నేతలుస్తా! అలాంటప్పుడు, ఈవిషయం తమరు మాఫుచేస్తే, అతనితో బాటు మాకందరికీ మేలుచేసిన వారవుతారు. క్షమించమని నాప్రార్థన.

బా-బై—చిత్తం మహాప్రభో; అతనినడత మెలాడున్నా, బీదబ్రాహ్మడు క్షమించండి, ప్రత్యేకించి, అతనిమీద ఫిర్యాదులేం లేవుగూడాను;-ఆపైని మీదయ;

కన—దీన్నే పాలుపోసి పామును పెంచడవంటారు పెద్దలు!

దా-పం—ఉ! [క్రూరముగ] నేనేవో నేరంచేసేస్ట! దాన్ని వీళ్ళురుజువుచేసేర్ట! అదిస్థిరపడిందట! అదిమాఫు చెయ్యాలని, ఈమాలకుంకడు, సాపం, శిపార్సు చేయడం! ఈక్షులట వానిని నివారించడం!- ఛీ! ఛీ!

(కనకము నుద్దేశించి) కనకం!- కాదు- నరకం!- నా భావిజీవితం అనే పాలలో చల్లచుక్క కలిపేవే! (పండ్లు పటపట కొరుకుచు నాపైపైనురుకబోయి, పిడికిలితో పొడువబోవును.)

పురుగ్గాడు చటాలున వానికాళ్లు బట్టుకొని కూర్చుండును, దాసుపంతులు కూలబడును).

బ—(చటాలునలేచి) సభ్యులారా! చల్లనిమాటలవల్ల యితడు లొంగేటట్లులేదు! నాయెదుటే నేరంచేయుడానికి సాహసించిన ధీరుడు! ఇదివరలో, పాపం! ఈయు మాయకురాల్ని, మీలో అనేకుల్నీ ఎంతహింసించి ఉంటాడో! ఈసమాచారం నేను ముందుగానే కనిపెట్టేను!

రామస్వామీ!- ఇదుగో! ఈఉత్తరం తీసుకొని, త్వరగా సైకిలుమీద పట్నంవెళ్ళి, పంతులుగారికి పరివారాన్ని వెంటబెట్టుకొనిరా!-

(రామస్వామి "చిత్త"మని వెడలును).

బ—ఓయ్! పురుగ్గా! సంకులూ! మీరిద్దరూ యీాతణ్ణి లోపల వసారాలో బంధించి, మీరిద్దరూ అక్కడే కాపుండండి! కదలడాని కేమాత్రం ప్రయత్నించినా మీ చేపాటికర్రలతోటి మోకాళ్ళమీదా, మోచేతుల మీదా, సీలమండలమీదా కొట్టడానికూడా మీాకు అధికార విస్తున్నాను.

పంతులుగారూ! మర్యాదగా వీళ్ళతో లోపలికి నడవండి, తక్కువ జాతివాళ్ళచేత దెబ్బలుతినకుండా! ఊ!

దా—[క్రూరముగఁ జూచుచు, లేచిబోవుచు, కనకమ్మను గాంచి, తలపంకించుచు, హుంకరించి] సమయం దొరకదా! (అనుచు నడచును).

బ—(నవ్వుచు) పంతులూ, ఇంకోకమారు హెచ్చరిస్తున్నా! కలం నాచేతిలోఉంది! పట్నంనుండి వాళ్ళొచ్చిన్దాకానే నీకు గడువు! బాగా ఆలోచించుకో!

(పురుగ్గాడూ, సంకులుగాడూ దాసుపంతులును బలముగ దీసుకొని పోవుదురు).

బ—అమ్మాయీ! కనకం! నీపనేవీ ఇక్కడలేదు. నీవిక వెళ్ల వచ్చును.

కన—మహాప్రసాదం! (నమస్కరించి బోవును).

సత్తి—చెలవుచ్చుగుంతానండి (నిష్క్రమించును).

బ—(లేచి, నిలుచుండి) సభ్యులారా! నేనీవూరు మకాంచేసినకార్యం ఒకటి, జరిగిందింకొకటీ అయింది. అదైనా పూర్తిగాకాలేదు! కొంచెం కొరదాఉండిపోయింది. వినండి! ఈ పంతులుకు శిక్షతప్పదు! ముఖ్యంగా మున సబుగిరీకి స్వస్తి జరిగే తీరుతుంది! ఆస్థానే ఇంకొకరు రావాలి! ఆవచ్చే ఆసామీ పరోపకారబుద్ధికలవాడు కావాలి. లేకుంటే, కార్యాలు యథాక్రమంగానే జరుగుతూంటాయి! ఏవంటారు?

ఇంటియజ—చిత్తం! తమరు శెలవిచ్చింది వాస్తవమే! తమ మెరికలో అలాంటివాళ్ళెవరైనా ఉన్నట్టయితే శెల వివ్వండి!

బ—ఒక్క నామెరుకలోనేకాదు, మీాకందరికీ తెలిసినవ్యక్తి, మీాగ్రామస్థుడే ఉన్నాడు.

రా-బ—(గ్రహించి) కాని, ఆవ్యక్తికి అంతపాటిసామర్థ్యం లేదని నామనివి!

కు—ఏవురుసెప్మా! రాంబ్రెమ్మంగోరే కాంవోసు!

బ—(నవ్వుచు)మరేం!వింటున్నారా?మీాకందరికీ సమ్మతేనా?- (సభ్యులంతా 'ఔ' నని సంతోషపూర్వకంగా దెల్పుదురు).-

రా—(తిరుగలేచి) మాగ్రామస్థులందరికీ నామీాదఉన్న అభిమానానికి నాకూ ఉత్సాహవే! వారికందరికీ సేవచేయడవంటే సంతోషవే. కాని, అధికారంపొందకుండానే, ఆపని చేయవచ్చునని నాతలంపు!

రాంబుగత—(ఇంటియజమాని)- గాని, రాంబ్రెహ్మాం! అధికారం గూడాఉంటే చేసేటంతటి ఉపకారం, పైనుండి చేయడాన్కి వీలుపడదని నాఊహా! ఏవంటే, ఆ అధికారం ఇంకొకళ్ళకుండి, నీవు కోరినప్రికారం సాగనివ్వకపోతే, నీవేంపాటుపడి యేంలాభం? ఇవుడంతే గదా అయింది! మీాపఠనమందిరం సాగనిచ్చేడూ? (బహద్దరును పీక్షించి) ఏం శెలవ్?

బ—అవును (ఆవాక్కును సిద్ధాంతీకరించును).

రా-బ—ఆ! ఆమాట నేనూ ఒప్పుకొంటాను! అయినా, రాంబుగతగారూ! నామాటలకీ, నాఅభిప్రాయాలకీ యెదురాడని వ్యక్తిని మునసబుగా నియమిస్తేనో?-

బ—ఓ! అలాంటి ఆసామీని చూపిస్తే, మేలే! ఒకటికి రెండ వుతాయి- ఈగ్రామాన్ని బాగుచేసేతలలు?

రా—ధన్యుణ్ణి! నాగురువుగారే ఆ ఆసామీ! మన అవధాన్లు గారే, మరెవరూకాదు! ఏం శలవ్!-

బ—ఓ! మీ గ్రామస్థులొప్పుకొంటే నాయభ్యంతరవేఁవీలేదు.

అవ—(లేచి యేమిరో పల్కబోవును- సభ్యులు- 'ఇద్దరిలో ఎవరున్నా, మాకు సమ్మతే'- అని కేకలిడుదురు).-

బ—[ఉత్సాహంతో]- నేటినుండి, అవధాన్లుగారే మీకు గ్రామమునసబుగారు! అయ్యా, నేడే ధరఖాస్తురాసి నాచేతికివ్వండి! నేనుదాన్ని దానికి సంబంధపడ్డ అధి కార్లకు స్వయంగాఇచ్చి మరీమిమ్మల్ని యీపనిలో నియమిస్తాను!- తిరుగా, నేనీగ్రామం మకాంవచ్చే సరికి విపరీతమైన మార్పులు జరుగుతాయి అనితలుస్తాను.

చా-సో—ఓ! అందుకు సందేగవా! ఓ! నాసిత్తవొచ్చినట్టు, ఆరి సదువులపాకలోసేరి సదిగేత్తాను!-

కు—ఆ! అంతటోడివే; కొట్టేవ్ డావ్! అపుడు నీకురెండు పాకలాతా యున్నమాట;-

సో—ఉండొస్; (కండ్లుకొట్టును)—

బ—(అదిగ్రహించి)-ఈపాకలో ప్రవేశించేడంటే, ఆపాక విడి చేస్తాడు, తెలుసా, సోవిగాడంటే ఏవిటనుకొన్నావ్;

సో—సిత్తం బాబయ్యా; సత్తెప్పెమానకంగా సెప్పుగొంతు న్నానూ, తవరిపాగాలట్టుకొని, ఈచీనం నగాయితూ ఒక్కనుక్కయినా తాగనండి; చస్;

సభ్యులు—ఓహో; ఇదాసంగతి, (పకపక నవ్వుదురు)—

సో—[చిన్నబోయినట్లు ప్రక్కకుబోవుచు, వెల వెలఁ జూచుచు] అయినా; కల్లుమీద బెమపాకుండా ఏమారాజైనా ఓమందు కనిబెడితే తలతాకట్టు పెట్టినా కొనుక్కొని తినేద్దును; [పెదవివిఱచును].

రా—ఇక చాలించ్రా; [వారిని తీక్ష్ణముగఁజూచును].

ఇంటి·యు—[రాంబాబు]—రాంబ్రహ్మంగారి చదువులపాకే ఆ మందులపాక; పుస్తకాలే ఆమందు;

బ—భేష్; అదే సత్యం;—

[పలువురు మెల్లమెల్లగ బహద్దరును మెచ్చుకొనుచు గుసగుస లాడుదురు, బహద్దరు యేవోకాగితముల సర్దుచుండును].

బ—[కొంతవడికి] ఇక సభ చాలిద్దాం; [లేచును].

[ఒక్కొక్కరు శెలవుగైకొని బోవుదురు]—
రామబ్రహ్మం, బాల-బైరాగి, ఇంటియజమాని,
కర్రిశెట్టి,—నౌఖరులు తప్ప!]

రా—(శెట్టినుద్దేశించి) ఉఁ! శెట్టీ! నువ్వూవెళ్ళొచ్చు!—

శె—(నసుగుతో) చిత్తం! శెలవుతీసుకొంటానండి! కాని,—
[భయపడి, ఆగిపోవును].—

బ—[నవ్వుచు] చెప్పు! ఏం?

క-శె—ఏంలేదు మారాజా! నానుదాఖలు సేసుకొన్న అర్జీ యిషయమండి!—

బ—దానికేం, అది రద్దయిందిలే!—

క-శె___తప్పు సేసేను, తవరు కాయాల! నా మొదరగా.-[చేతు లునలువుచూ నిలుచుండును]-

బ___[ఆలోచిస్తూ] నువ్వు చూస్తుండగా రద్దుచేసేయమంటావ్ !

క-శె___సేకుంతే, గుండెలుగుబుకూ గుబుకూ మంటూంటే కంటికి కునుకేనా రాదండి, మా రాజా!-

బ పరె! అలాగే చేస్తానుగాని, నాకో వాగ్దానం చేస్తావా?-

క-శె___సిత్తం! ఏం పెమాణకం సెయ్యమంటే అదేసేత్తాను ఇషయు వేదో చెలవివ్వండి, అచ్చరాలా జరిపిత్తాను!-

బ___నిజంగా!-

క-శె___తవరి మాటదాటుతే, మరిగతులుంటాయా, పెబూ!

బ___సరి! అలాగయితే, ఈ రైతులకి అప్పులిచ్చేటప్పుడు___

క-శె___తవరే పెక్కారం చెలవిస్తే ఆ పెక్కారవే వొడ్డీ లుచ్చుగుంతానండి!-

బ___ఆవరవడ్డీ ఇప్పటికి రావల్సిన బాకీలలో ఎక్కువలు మాపుచేస్తావా?

క-శె___ఓ! అగత్యంగా!- ఇప్పుడు చెలవిత్తే యెల్లిపద్దులన్నీ టిమీదా చెల్లులు రాయించేత్తాను!-

బ___సరె! అయితే! రామబ్రహ్మం, శెట్టి చెప్పిన్ది విన్నావుగా! మీరుముగ్గురూ, పంచాయితీచేసి, ఆ ప్రకారం చేసేయండి! తర్వాత మీ గ్రామంలో పెద్దల్ని ఐదుగుర్ని చేర్చి, అవసరమైన రాజీనామా పత్రాలూ, పంచాయితీ తీర్పులూ మొదలైనవన్నీ సమకూర్చి, యీ సాయంత్రంలోగా, అవన్నీ నాదగ్గరకు తీస్తానిరా; రద్దు

చేసేద్దాం!- ఇదుగో! ముందు శెట్టిపేరట ఉన్నపద్దుల మీద *చెల్లులువడాలి!వడ్డీరూపాయి 1॥కిదమ్మిడీకి మించ కూడదు, తెల్సిందా!-

రా- —చిత్తం;మాపేరఉన్న పద్దులన్నీ ఆప్రకారవే రద్దుచేస్తాం.

బ— .సంతోసం, మరి మీరు వెళ్ళొచ్చును, చాలావేళైంది!-

క. శె—సిత్తం! తవరి నాట్టేకష్టపెట్టేసేనండి! అదంతా మరిసి పోయి, రచ్చించండి, మారాజా! సెలవుచ్చుగుంతా నండి! రాండి, బాబూ, యెల్దాం:-

[రాం[బహ్మం, బా-బై,- ఇంటియజమాని మువ్వురు, నవ్వుకొనుచు, శెలవుగైకొని, బోవుదురు. శెట్టివారి వెంబడిని బోవును.]

బ—[నగ, లోనికి పోబోవుచు] ఒరే, కురవా, సోవిగా; మీరుకూడా, యీసభ మత్తబ్ చేసి ఇళ్ళకుపోండి; వేగిరం భోంచేసి వచ్చేరంటే, మిమ్మల్ని అక్కడ కాపుంచి, వాళ్లిద్దర్నీ ఇంటికి పంపించేస్తాను. ఈలోగా పట్నంనుంచి వాళ్ళొచ్చేరంటే, భయవేలేదు; [పోవు చుండును].

కు-సో—సిత్తం.-

బ—[వెనుదిరిగి] ఒరే, సోవిగా; భయంలేదులే, ఉషారుగా పాడుకుంటూనే పనిచేసుకోండి;- [లోనకుబోవును]—

సోమిగాడు గంతులువైచుచు, పాడును—

[కురవడు ఉల్లాసములో వానికి బనిసాయము జేయును]

పాట

వేపూరు స్టేషనుకాడ - వేపాగున్నాలకాడ ॥వేపూ॥
మోపూ- నెత్తినిబెట్టి - కట్టెల... మోపూ॥
మట్టేలూ - సరుదూకొంటూ, కాళ్ళ-
మట్టేలూ - సరుదూకొంటూ...
అలసీపోనట్టూ - నడసీ, నడసీ
అలసీపోనట్టూ - ననుగాంచి,
అలసీపోనట్టూ - నిలసీ.
నిలసి, నను - పక్కకుపిలసీ - నా
సోగముక్కూ - సొద్దేవన్నావేనా, నా-
కోరమీసం - కోరూకొన్నావే-
చిలకలకొలికీ - నను - చేరూకొన్నావే,
ననుచేరూకొన్నావే॥-ఊ-
తరనన తందాన - తానా- తందానా- తానా-

కుర—ఓరి, నోరుముయ్యరా! ఎక్కువాతోంది, ఖులాసా!
చా-సో—ఉ! (ఆగి, నగుమోముతో) కానీ, అయితే.

[సభయందమర్చబడిన సామాన్లనుసర్ది ఇరువురు నిష్క్రమింతురు].

(మంగళం)



